


సంపుటి: 2 సంచిక: 3 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 ఏప్రియల్ 2016



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు: 9491870753

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖ చిత్రం: “వేసవి పాట”

చిత్రకారుడు: వీరాంజనేయులు

83




---

ఏ వేదంబు పఠించె లూత? భుజంగంబే శాస్త్రములూచె? తా-
నే విద్యా భ్యసనంబొర్చె కరి? చెంచేమంత్ర మూహించె? బో-
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా? కావు! నీపాద సం-
సేవాసక్తియె గాక జంతు తతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా!!

భావం: శ్రీ కాళహస్తీశ్వరా! లూత (సాలీడు) ఏ వేదాలు చదివింది? భుజగం (పాము) ఏలాంటి శాస్త్రాలు పఠించింది? కరి (ఏనుగు) ఏం చదువులు చదివింది? చెంచు (కన్నప్ప) ఏం మంత్రాలు సాధన చేశాడు? ఈ మామూలు చదువుల వల్ల 'బోధ' (జ్ఞానం) కలుగదు కదా, స్వామీ? ప్రాణులకు జ్ఞానం కల్గించేది కేవలం నీ పాదాలను సేవించాలన్న ఆసక్తి తప్ప మరేదీ కాదు!

*- శ్రీ పోటు బాల్‌రెడ్డి, భీమారం గారి సౌజన్యంతో*



# నలుగురు మిత్రులు

కొత్త బేతాళం

*రెట్టించిన ఉత్సాహంతో మళ్ళీ చెట్టెక్కాడు విక్రం. అక్కడున్న బేతాళాన్ని భుజాన వేసుకొని చెట్టు దిగబోయాడు. అంతవరకూ కదలక మెదలక ఉన్న బేతాళం అకస్మాత్తుగా ప్రాణం ఉన్నదాని మాదిరి ఒళ్ళు విరుచుకున్నది. ఏదో ఆలోచనలో ఉన్న విక్రం ఉలిక్కిపడేట్లు, మాట్లాడటం మొదలు పెట్టింది :*

*"చూడు విక్రమ్! ఈ ప్రపంచంలో అందరూ ఎవరికి వాళ్ళే పెద్దలు. ఊరికే పేరుకు 'గురువులు' అంటుంటారుగానీ, ఆ గురువులు ఇచ్చే సలహాలను మటుకు ఎవ్వరూ పట్టించుకోరు. అట్లాంటి ఓ నలుగురు పనికిమాలిన శిష్యుల కథను చెప్పింది- కులుసూంబీ అనే పాప. శ్రమ తెలీకుండా ఉండేందుకు నీకు ఆ కథ చెబుతాను, విను " అంటూ ఇలా చెప్పసాగింది.*

అనగనగా ఒక ఊరిలో నలుగురు స్నేహితులు ఉండేవారు. ఈ నలుగురిలో ఒకరు మేస్త్రీ, ఒకరు చిత్రకారుడు, ఒకరు శిల్పి, ఇక నాలుగోవాడు పూజారి.

అయితే పాపం వీళ్ళకు సొంత వూరిలో పని లేకుండా అయ్యింది. దాంతో "ఉన్న ఊళ్ళో బ్రతకటం అనే యోగం అందరికీ ఉండదు- మనకు ఇక్కడ నప్పేటట్లు లేదు. వేరే ఎక్కడికైనా పోతే నయం" అన్నాడు పూజారి.

"ఎక్కడైనా పెద్ద పెద్ద పనులు జరిగే చోట ఉండాలి. రాజుగారు గొప్ప నిర్మాణాలు

చేపట్టుతుంటారు. అక్కడికి వెళ్తే మనందరికీ పనులు చిక్కుతై" అన్నాడు శిల్పి.

"నిజమే- రాజాస్థానంలో తప్ప నేను గీసే చిత్రాలకు గుర్తింపు ఉండదు- అక్కడికి వెళ్దాం" అన్నాడు చిత్రకారుడు.

"రాజధానిలో పెద్ద పెద్ద ఇళ్ళు కడుతుంటారు- నాకూ అక్కడేదో పని దొరక్కపోదు. పదండి" అన్నాడు మేస్త్రీ.



పూజారి నిర్ణయించిన ముహూర్తానికి నలుగురూ బయలుదేరి రాజధాని బాట పట్టారు. ఆ రోజుల్లో ఇప్పటిలాగా బస్సులూ, స్కూటర్లూ లేవు- నలుగురూ అడవి దారుల్లో నడుచుకుంటూ పోసాగారు. పగలంతా నడక; అలసట; సాయంత్రం ఏదో ఒక పల్లెలో బస; విశ్రాంతి. ఇలా చాలా రోజులు సాగింది. దారిలో తిందామని వాళ్ళు తెచ్చుకున్న సామాన్లన్నీ దాదాపు ఖాళీ అయిపోయాయి. ఎక్కడైనా ఏమైనా కొనుక్కుందామన్నా చేతిలో డబ్బులు లేని స్థితి.

ఆ సమయంలో ఒక రోజున వాళ్ళు ఒక అడవిలో ప్రయాణిస్తుండగానే సాయంత్రం అయ్యింది. దాంతో వాళ్ళు నలుగురూ అక్కడే వంట చేసుకొని, సమీపంలో ఉన్న ఒక మర్రి చెట్టు క్రింద కూర్చొని భోజనం చేసారు. ఆ సరికి చీకటి పడింది.

"అందరం తలా ఒక చెట్టు చూసుకొని పడుకుందాం" అన్నాడు పూజారి, చీకట్లోకి చూస్తూ.

"చెట్టు క్రింద పడుకుంటే అంతే బాబయ్యా, పైకెక్కాలి" అన్నాడు మేస్త్రీ.

"అందరం నిద్రపోతే సమస్య కావొచ్చు- క్రూరమృగాలూ అవీ వస్తే కష్టం" అన్నాడు చిత్రకారుడు.

"వంతులు వేసుకొని కాపలా కాద్దాం. మిగతావాళ్లంతా నిద్రపోవచ్చు. పుల్లలు తెచ్చి

నెగడు వేస్తే ఏ మృగాలూ రావు. అది ఆరిపోకుండా చూసుకుంటే చాలు" అన్నాడు శిల్పి.

మొదటి వంతు మేస్త్రికి వచ్చింది. మేస్త్రీ మేలుకుని వున్నాడు; మిగిలిన వాళ్ళు నిద్రపోతున్నారు. నెగడు బాగా వెలుగుతున్నది. కొద్దిసేపటికి మేస్త్రీకి నిద్రరావటం మొదలైంది. "ఇట్లా ఏమీ చేయకుండా ఊరికే కూర్చొని ఉంటే నిద్ర మేలుకోవడం కష్టం! ఏదో ఒకటి చేస్తుంటే తప్ప శరీరం సహకరించదు" అని చుట్టూ చూసాడు అతను. అక్కడికి దగ్గర్లో మంచి మంచి రాళ్ళు కనిపించాయి. వాటిని తీసుకొచ్చి, ప్రక్కనే ఉన్న వేపచెట్టు క్రింద ఒక చిన్న అరుగు, దానిపైన ముద్దుగా ఓ చిన్న ఇల్లు కట్టాడు అతను. ఆ సరికి తన వంతు సమయం గడిచింది- శిల్పిని నిద్రలేపి తను పడుకున్నాడు.

శిల్పి చూసాడు- మేస్త్రీ నిర్మించిన ఇల్లు ముచ్చటగానే ఉంది- కానీ "పూర్ణత్వం లేదు" అనుకున్నాడు. "ఖాళీగా ఉంటే బాగా లేదు" అని అటూ ఇటూ చూసాడు. దగ్గర్లోనే ఒక మంచి రాయి కనిపించింది. దాన్ని చెక్కటం మొదలెట్టాడు- అద్భుతమైన గణపతి బొమ్మ ఒకటి తయారైంది. దాన్ని ఆ ఇంటిలో ఉంచాడు. "ఇప్పుడు బాగుంది" అనుకున్నాడు. ఆ సరికి తనవంతు సమయం అయిపోయింది- చిత్రకారుడిని నిద్రలేపి, తను పడుకున్నాడు.



చిత్రకారుడు చూసాడు- నెగడు వెలుగు-తున్నది. ఆ వెలుగులో కొత్తగా కట్టిన చిట్టి ఇల్లు, అందులోని గణపతి విగ్రహం కనిపించాయి. "చాలా చక్కగా ఉన్నై" అనుకున్నాడు. "అయినా ఎంత బాగున్నా, రంగులు వేస్తేనే కదా, వీటికి అందం?! అప్పుడింక ఇవి చాలా చాలా బాగుంటాయి" అని తన ప్రతిభతోటి వాటికి అద్భుతమైన

రంగులు వేశాడు. ఇక దాంతో అతని వంతు సమయం అయిపోయింది- పూజారిని నిద్రలేపి తను పడుకున్నాడు.

పూజారి లేచి చూసే సరికి అక్కడో చక్కని చిట్టి ఇల్లు, అందులో నెలకొని ఉన్న అద్భుతమైన గణపతి, వాటికి సజీవత్వాన్ని ఇచ్చే ఆకర్షణీయమైన రంగులు కనిపించాయి. "ఇకనేమి, ఈ అడవి తరించింది! ఇక్కడ భగవంతుడు మూర్తీభవించాడు" అని అతను అడవి పూలు, అడవి పండ్లు తెచ్చి, రకరకాల స్తోత్రాలతో పూజలు చేయటం మొదలు పెట్టాడు.

అయితే అక్కడికి దగ్గర్లోనే ఓ గ్రామం ఉంది. గ్రామస్తులు ఉదయాన్నే అటుగా వెళ్తూ విన్నారు- "ఇదేందబ్బా! ఇక్కడేవో మంత్రాలు వినిపిస్తుండాయి?" అని అక్కడికి వచ్చి చూస్తే "రాత్రికి రాత్రి వెలిసిన గణపతి!" ఇంక అందరూ అక్కడికి వచ్చి మొక్కుకున్నారు. ముచ్చటగా ఉన్న ఆ గుడినీ, ప్రాణం ఉట్టిపడేట్లున్న మూర్తినీ, చక్కని ఆ రంగుల్నీ, పవిత్ర వాతావరణాన్నీ చూసి మైమరచి పోయారు. వాళ్ళని చూసి ముచ్చటపడిన నలుగురు మిత్రులూ "ఇవాల్టికి ఇక్కడే ఉండి, రేపు ఉదయాన్నే వెళ్దాం" అని అక్కడే ఆగిపోయారు.

అయితే "అడవిలో వెలిసిన గణపతి" కథ ఒకరినుండి ఒకరికి అందింది- సాయంత్రం అయ్యేసరికి ఆ చుట్టు ప్రక్కల ఉన్న ఊళ్ళన్నిటి నుండీ జనాలు కుప్పలు తెప్పలుగా, తిరనాళ్ళకు వచ్చి పడ్డట్లు వచ్చారు. అందరూ బారులు తీరి దేవుడిని దర్శించుకున్నారు. "అయ్యలూ, మీరు ఇంత శక్తి గలవాళ్ళు- మీరు ఇక్కడే ఉండాల, కొంతకాలం" అని ఎవరికి వాళ్ళు పండ్లు, తినే పదార్థాలు, బియ్యం, డబ్బులు ఇంకా ఏవేవో కానుకలు ఇచ్చారు మిత్రులకు. చీకటి పడేసరికి ఆ పల్లెల పెద్దలంతా కలిసి వచ్చారు- "మా ఊళ్ళన్నీ మీ వల్ల పావనమైనాయి. మీరు సరేనంటే మేమందరం చందాలు వేసుకొని ఇక్కడే ఓ గొప్ప గుడిని నిర్మిస్తాం. దానికి మీరే సారథులు!" అన్నారు.

మిత్రులు నలుగురూ ఒకరి ముఖాలొకరు

చూసుకొని, సంతోషంగా సరేనన్నారు.



ఆరోజు రాత్రి చక్కగా భోంచేసాక, నలుగురూ మాట ముచ్చట్లు చెప్పుకుంటూండగా "..కానీ- నేనెప్పుడూ గుడిని కట్టలేదు" అన్నాడు శిల్పి.

"నేను ఎన్నడూ గుడిలో ఉంచే విగ్రహాలను చెక్కలేదు- ఇప్పుడు ఒక్కసారిగా భవ్యమందిరపు విగ్రహాలు అన్నీ చెక్కమంటున్నారు- ఎట్లాగో ఏమో.." అన్నాడు మేస్త్రీ.

"ఏదో ఊరికే రంగులు వేసాను గానీ, ఇంత పెద్ద నిర్మాణానికి రంగుల నిర్ణయం- నావల్ల అవుతుందా?" అన్నాడు చిత్రకారుడు.

"సరిగా పూజ చేయాలంటే నేను చదవాల్సిన శాస్త్రాలు ఇంకా ఎన్ని ఉన్నాయో కూడా నాకు తెలీదు- అందుకని మనం ఒకసారి మనం ఊరికి వెళ్ళొద్దాం. మనకు విద్య నేర్పిన గురువులను సంప్రతిద్దాం- పని పరంగా వాళ్ళిచ్చే సలహాలను పాటిస్తే తప్పులు జరగవు-" అన్నాడు పూజారి.

మిత్రులందరికీ ఆ ఐడియా నచ్చింది. "ఒక్కసారి మా పెద్దల్ని కలిసి వచ్చేస్తాం- రాగానే పని మొదలెడతాం. ఆలోగా మీరు విరాణాలు సేకరిస్తూండండి" అని పల్లె పెద్దలకు చెప్పి నలుగురూ సొంత ఊరు చేరుకున్నారు.

శిష్యులు చెప్పిందంతా విన్నారు వాళ్ల గురువులు. "నువ్వు చదివిన స్తోత్రాలు తప్పు- క్రొత్తగా కట్టిన మందిరం అభివృద్ధిలోకి రావాలంటే ఫలానా మంత్రాలు చదవటం, ఈ ఈ తంతులు చేయటం తప్పని సరి- అవన్నీ తెలీకుండా నువ్వసలు పూజలెలా చేసావు?" కసిరాడు పూజారికి విద్య నేర్పిన గురువు.

"గుడి నిర్మాణానికీ, ఇంటి నిర్మాణానికీ చాలా తేడాలుంటాయి. వాస్తు లెక్కలు ఉంటాయి- నువ్వు అన్నింటా తప్పావు!" అన్నాడు మేస్త్రీకి

విద్య నేర్పిన గురువు.

"చుట్టూ పచ్చని వాతావరణం ఉన్నప్పుడు ముదురు రంగులు బాగుంటాయి- నువ్వు అన్నీ తేలిక రంగులు వేసావు- చాలా వికారంగా ఉండి ఉంటుంది" అన్నాడు చిత్రకారుడి గురువు.

"గుడిలో ఉంచే విగ్రహానికుండాల్సిన లక్షణాలు లేశ మాత్రంగానైనా లేవు, నువ్వు చెక్కిన బొమ్మలో. విగ్రహాలు నాట్యశాస్త్రానికి అనుగుణంగా కదా, ఉండాల్సింది?" అన్నాడు శిల్పికి విద్య నేర్పిన గురువు.

కొంచెం చిన్నబుచ్చుకున్న మిత్రులు నలుగురూ "మీరూ మాతో రండి- అందరం కలిసి మందిరం నిర్మించి వద్దాం" అన్నారు గురువులతో.

వాళ్ళెవరూ ఒప్పుకోలేదు- "లేదు- మీకు అర్థం అయినట్లు లేదు. మమ్మల్నడిగితే అసలు ఇట్లా సొంతగా పని చేసేది ఏదీ పెట్టుకోకండి. పోయి రాజుగారి దగ్గర ఏవైనా చిన్న పనులు వెతుక్కోండి" అన్నారు.

మిత్రులు నలుగురూ కొంచెం సేపు ఆలోచించి, వచ్చిన త్రోవనే వెనక్కి తిరిగి వెళ్ళారు.

సంవత్సరం తిరిగే సరికి, వాళ్ల సారథ్యంలో నిజంగానే చాలా గొప్ప మందిరం ఒకటి తయారైంది. చుట్టు ప్రక్కల పల్లెల్లోంచే కాక, సుదూరంగా ఉన్న రాజధాని నుండి కూడా, అనేకమంది ఆ గుడిని, విగ్రహాన్ని దర్శించుకునేందుకు వచ్చారు. అందరూ వాళ్ళ పనితనాన్ని, మందిర నిర్మాణ కౌశలాన్ని మెచ్చుకుంటుంటే మిత్రులు "ఇదంతా మా గురువుల గొప్పతనమే- మాదేమీ లేదు" అనేవాళ్ళు వినయంగా.

విక్రమ్‌కు ఈ కథ చెప్పిన బేతాళం "ఇంతకీ విక్రమ్- అసలు ఈ నలుగురు మిత్రుల సమస్య ఏంటో నాకు అర్థం కాలేదు. పనులన్నీ తప్పుగా చేసినవాళ్ళు, గురువుల మాట వినకుండా వెనక్కి పోయి మందిర నిర్మాణం ఎందుకు తలపెట్టినట్లు- గురువులు చెయ్యమన్నది అది కాదు గదా? ఇకపోతే, వాళ్ళు అన్ని తప్పులు చేసినా జనాలు వాళ్ళని శ్లాఘించటం ఏమిటి? పనితనంతో బాటు సరైన కళను మెచ్చేవాళ్ళూ తగ్గిపోతున్నారనటానికి ఇది

ఒక తార్కాణం కాదా?! చేసేదంతా చేసాక, మరి వాళ్ళు 'ఇదంతా గురువుల గొప్పతనమే' అనటమేమిటి?" అని అడిగాడు.

విక్రం చిరునవ్వు నవ్వి "శిష్యులకు విద్య గరపటం, వాళ్ళ పనిలో తప్పొప్పులు గుర్తించి చెప్పటం గురువుల ధర్మం. ఈ కథలో నలుగురు గురువులూ తమ శిష్యుల తప్పుల్ని ఎత్తి చూపటమే కాక, సరైన మార్గదర్శనం కూడా చేసారు. తెలివైన శిష్యులు తమ తప్పుల్ని ఆ క్షణంలోనే గుర్తించారు; సరైన పద్ధతులేమిటో కూడా అర్థం చేసుకున్నారు. కనుకనే ధైర్యంగా వెళ్ళి మందిర నిర్మాణం చేపట్టారు. తమ పని ఎలా ఉండాలో తెల్సుకున్నారు కనుక అటుపైన వాళ్ళు మందిరాన్ని పూర్తిగా శాస్త్రబద్ధంగా నిర్మించి ఉంటారు. అలాంటప్పుడు అది అందరి ప్రశంసలనూ అందుకోవటంలో ఆశ్చర్యమేమీ లేదు" అన్నాడు.

అలా విక్రంకు మౌనభంగం కలగటంతో బేతాళం అతని పట్టు నుండి చటుక్కున విడివడి, మళ్ళీ చెట్టుకొమ్మ మీదికి చేరుకున్నది!

*ఆధారం: 'రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్'లో 8 వ తరగతి చదువుతున్న కులుసూంబీ పంపిన కథ !*

**ఉగాది కవిత!**

కొత్త దుస్తుల ఉగాది

మామిడి తోరణాల ఉగాది

ఆరు రుచుల ఉగాది

తీపి రుచి...తీపి రుచి

అమ్మ ప్రేమ తీపి రుచి

చేదు రుచి...చేదు రుచి

జీవితపు బాధలు చేదు రుచి

పులుపు రుచి...పులుపు రుచి

మనలో మంచి-చెడు పులుపు రుచి

కారం రుచి...కారం రుచి

జీవితంలోని అవమానాలు కారం రుచి

ఉప్పు రుచి...ఉప్పు రుచి

ఆత్మ స్థైర్యమే ఉప్పు రుచి

అన్ని రుచులూ ఉంటేనే ఉగాది పచ్చడి

ఇవన్నీ కలిసి ఉంటేనే జీవితం

*"గోరంత దీపాలు" జి. అక్షిత , 8వ తరగతి, ZPHS, కోగిర, రొద్దం మండలం, అనంతపురం జిల్లా.*



# రాజకుమారుడి ఉపాయం



*రచన: మృదుల, ఆరవ తరగతి, రఘునాథ మోడల్ హైస్కూల్, చైతన్య పురి, హైదరాబాద్-500060*

నాగపుర మహారాజు భస్మసేనుడు దయగలవాడు. ఆయన పరిపాలనలో ప్రజలంతా సుఖ శాంతులతో జీవించేవారు. సమస్యలేమైనా ఉంటే ప్రజలు రాజుగారి దర్బారులో నివేదించుకోవచ్చు. రాజుగారు అప్పటికప్పుడు అధికారులకు ఆదేశాలు జారీ చేస్తారు. ప్రజలందరికీ అనువుగా ఉండేట్లు, నెలకు మూడు వారాలపాటు ప్రతిరోజూ రాజ దర్బారు జరిగేది.

నాగపురానికి ఒక చివరన దట్టమైన అడవి ఒకటి ఉండేది. ఆ అడవిలో అనేక క్రూరమృగాలుండేవి. అయినా ఏనాడూ అవి మనుషులమీదికి వచ్చేవి కావు.

అలాంటిది, ఒక ఏడాది వేసవి ప్రారంభం అవుతున్నదనగా శివార్లలోని ఒక గ్రామ ప్రజలు దర్బారుకు వచ్చి "అడవిలోని ఏనుగులు మా పంటపొలాలను నాశనం చేస్తున్నాయి- వాటిని భయపెట్టేందుకు

అవసరమైన డప్పులు, టపాకాయలు తయారు చేయించి ఇప్పించాలి" అని మనవి చేసుకున్నారు.



భస్మ సేనుడు వెంటనే ఆదేశాలు ఇచ్చాడు- "వీరికి అవసరమైన వస్తువులను సమకూర్చండి" అని. వాళ్ళు సంతోషంతో వెనుతిరిగారు గానీ, ఆ సమయంలో అక్కడే ఉన్న మంత్రిగారి ముఖం వివర్ణం అవ్వటం గమనించాడు భస్మసేనుడు.

వాళ్ళు వెళ్లగానే మంత్రిగారిని దగ్గరికి పిలిచి అడిగాడు- "మీరేదో, విచారంగా ఉన్నారు- అదేమిటో మాకూ చెబితే మేమూ ఆలోచిస్తాం" అని.

అక్కడే ఉన్న రాజకుమారుడు సుందరసేనుడు చిరునవ్వు నవ్వి- "ప్రభువుల పరిశీలనా శక్తి అమోఘం. నేను, మంత్రిగారు ఇంతకు ముందే మాట్లాడుకున్నాం- ఏనాడూ లేనిది ఏనుగులు పంటపొలాలమీదికి వచ్చాయంటే, అడవిలో వాటికి ఏదో సమస్య ఎదురై ఉంటుంది. గత సంవత్సరం వానలు కూడా సరిగా పడలేదు; అడవిలోని మడుగులు ఎండి ఉంటాయి. నీళ్లకోసం అవి గ్రామ ప్రాంతాలకు వచ్చి ఉంటాయి. ఇప్పుడు మన వద్దకు వచ్చింది ఒక్క గ్రామ ప్రజలే- త్వరలో అనేక గ్రామాలవాళ్ళకు ఈ సమస్య ఎదురవు-తుంది. మనం అందరికీ డప్పులు, టపాకాయలు ఇవ్వలేం కదా; సమస్య మూలాన్ని స్పృశించేట్లు, మనం త్వరలో ఏదో ఒకటి చేయాల్సి ఉంటుంది" అన్నాడు.

"చూద్దాం. సమస్య విస్తృతి ఎంత ఉన్నదో మనకు తెలీదు. ఈరోజే చారులను ఆ ప్రాంతాలకు పంపుదాం. శివారు గ్రామాలలో ఎన్నిటికి ఇటువంటి సమస్యలు ఉన్నాయో చూసి రమ్మందాం" అన్నాడు భస్మసేనుడు, గూఢచారులకు కబురంపుతూ.

సుందరసేనుడి అనుమానం నిజమేనని తేలింది చారుల పరిశీలనలో. శివారు

గ్రామాలన్నిటిలోనూ అడవి జంతువుల సమస్య మొదలై ఉన్నది. ప్రజలు ఎవరికి వారు అడవి జంతువులను వేటాడు-తున్నారు; చంపుతున్నారు. కొన్ని చోట్ల పులులు, కొన్ని చోట్ల చిరుతలు, నక్కలు, కుందేళ్ళు మరికొన్ని చోట్ల ఏనుగులు, ఎలుకలు- ఇలా ఏ ఊరికాఊరు సమస్యల వలయంలో చిక్కుకొని ఉన్నది!



రాజుగారు వెంటనే ఆ గ్రామాలన్నిటిలోనూ రక్షణ బృందాలను ఏర్పరచటమే కాకుండా "అడవుల్లో జంతువులను బెదర గొట్టటం వల్ల, వాటి నివాస స్థలాలను దెబ్బ తీయటం వల్ల అవి ఊళ్ళమీద పడతాయి. అందువల్ల అడవిలోకి వెళ్ళి వేటాడరాదు; అడవిలో చెట్లను నరకరాదు; అడవుల పచ్చదనాన్ని నిలిపి ఉంచేలా ప్రవర్తించాలి. మనం అడవులను నాశనం చేయకపోతే జంతువులు అక్కడే ఉంటాయి" అని ఊరూరా చాటింపులు వేయించారు. అడవిలో వాగుల్ని, వంకల్ని పరిశీలించి, వాననీరు మడుగులలో చేరుకునేందుకు మార్గాలను సరి చేశారు. గ్రామ శివార్లలోని జలాశయాలను బలోపేతం చేశారు.

ఆ సంవత్సరం వానలు పడేసరికి అడవుల్లోని మడుగులన్నీ నీటితో కళకళలాడాయి. అటుపైన ఇక గ్రామాలకు అడవి జంతువుల సమస్యే లేదు!



# చెడపకురా, చెడేవు!

రచన: ఆడెపు సామిత్, తొమ్మిదవ తరగతి, ZPHS, ముస్తాబాద్, కరీంనగర్ జిల్లా -505404

అనగనగా ధర్మారం అనే ఊరిలో రామయ్య-భీమయ్య అనే ఇద్దరు మిత్రులు ఉండేవారు. రామయ్యకు భీమయ్య అంటే చాలా ఇష్టం. భీమయ్య మాత్రం రామయ్య దగ్గర ఉన్న డబ్బును మాత్రమే చూసేవాడు.

రామయ్య భార్య లక్ష్మికి తెలుసు, భీమయ్య ఎలాంటివాడో. కానీ రామయ్య ఆమె మాటల్ని పట్టించుకునేవాడు కాదు. మిత్రుడిని అమితంగా ప్రేమించేవాడు.

అయితే రాను రాను మిత్రుల ఆర్థిక పరిస్థితి దిగజారటం మొదలైంది. దాంతో రామయ్య 'పట్నానికి వలస పోదాం' అనుకున్నాడు. "ఇప్పుడు వెళ్తే తన దగ్గరున్న కొద్దిపాటి డబ్బులతో ఏదైనా వ్యాపారం మొదలు పెట్టుకోవచ్చు. తర్వాత తర్వాత అది కూడా వీలవ్వకపోవచ్చు.."

అయితే భీమయ్య దానికి ససేమిరా ఒప్పుకోలేదు. "మన పొలాలు ఎటు పోతాయి? కావాలంటే నీ పొలం కూడా నేనే సాగు చేసి పెడతాను!" అన్నాడు.

రామయ్య కుటుంబం పట్నానికి వలస పోయింది. భీమయ్య అక్కడే ఉండి రామయ్య పొలాన్ని కౌలుకు చేయటం మొదలు పెట్టాడు. "ఖర్చులు నువ్వు పెట్టు;

పొలంలో వచ్చిన లాభాలను సమానంగా పంచుకుందాం" అన్నాడు.

పట్నంలో రామయ్య వ్యాపారం బాగానే సాగింది. అక్కడ తనకు వచ్చిన కొద్దిపాటి లాభాలను కూడా రామయ్య తన వంతు పెట్టుబడిగా భీమయ్య చేతికి ఇస్తూ వచ్చాడు. తీరా పంట చేతికి వచ్చే సరికి భీమయ్య మొండి చెయ్యి చూపించాడు: "ఏం చెప్పమంటావు రామయ్యా! వానలే లేవాయె! నీ పొలం అసలు పండనే లేదు!" అన్నాడు.

"అందరి పంటలూ బాగానే పండుతున్నాయి కాని నా పంట పండట్లేదేమి?" అని దిగులు చెందేవాడు రామయ్య.

"కొన్ని రోజులు ధర్మారం లోనే ఉండి చూద్దాం" అన్నది లక్ష్మి, భీమయ్య మాటల మీద ఒకింత అనుమానంగా.

నిజంగానే వాళ్ళు ఉన్న కొద్ది రోజుల్లో పంట చాలా మెరుగైంది. ఏపుగా పెరిగిన పంటను చూసి "ఈసారి మంచి ఫలితాలు వస్తాయి" అని కొంచెం ఆశపడ్డాడు రామయ్య. తరువాత భీమయ్యకు కొంత ఎక్కువ డబ్బు ఇచ్చి, పంటకు అవసరం అయ్యే పనిముట్లు తెప్పించమని, తను పట్నం చేరుకున్నాడు.

అయితే "ఈ సంవత్సరమూ పంట బాగా పండలేదు- నీ పొలానికి ఏదో అరిష్టం పట్టినట్లుంది. సాధనాల వల్ల కూడా ఫలితం రాలేదు" అన్నాడు భీమయ్య, ఒక్క పైసా కూడా ఇవ్వకుండా.



వ్యాపారంలో వచ్చిన లాభాలతో ఈసారి తన పొలంలో బోరుబావులు వేయించాడు రామయ్య. పంట ఎలా ఉన్నదో చూసుకు-నేందుకు ప్రతినెలా ఒకసారి తనూ, లక్ష్మి ఊరికి రావటం మొదలుపెట్టారు.

దాంతో పరిస్థితి కొంత మెరుగయింది. పంట బాగా వచ్చింది. రామయ్య, లక్ష్మి ఇద్దరూ దగ్గర నిలబడి పంటను నూర్పించారు.

భీమయ్య "ఈసారి నీ అదృష్టం బాగుంది" అని మాటవరసకు మెచ్చుకున్నాడుగానీ, డబ్బుల దగ్గరికి వచ్చేసరికి- "రేపు ఇస్తాను- ఎల్లుండి ఇస్తాను" అని దాటవేస్తూ వచ్చాడు.

"చూసారా, మీ మిత్రుడి బుద్ధి?!" అన్నది లక్ష్మి. ఆమె పోరు పడలేక రామయ్య డబ్బులు ఇమ్మని భీమయ్యను ఒత్తిడి చేయటం కొనసాగించాడు. మరొకవైపున లక్ష్మి భీమయ్య భార్యపై ఒత్తిడి పెంచింది.



చివరికి ఒకరోజున భీమయ్య "నా దగ్గర ఎక్కడున్నై రామయ్యా, డబ్బులు?! మళ్ళీ సంవత్సరం ఇస్తాలే" అనేసాడు. అయితే అదే రోజున లక్ష్మి పోయి అతని భార్యనుండి తమకు రావలసిన మొత్తాన్నంతా వసూలు చేసుకొచ్చింది!

అప్పుడు రామయ్యకు అర్థమైంది- భీమయ్య తనను ఎంత మోసం చేస్తున్నాడో! లక్ష్మి చెప్పిన మాటను తను ముందుగానే విని ఉండాల్సిందని బాధపడ్డాడు.

అటు తర్వాత భీమయ్యతో సంబంధాలు తగ్గించుకున్నాడు. వేరే పాలేరును ఒకరిని పెట్టుకొని, స్వయంగా తన పంటను తానే పండించుకున్నాడు.

దాంతో అటు వ్యాపారమూ లాభాల్లో కొనసాగింది; ఇటు పొలమూ వృద్ధిలోకి వచ్చింది. రాను రాను రామయ్య మంచి స్థాయికి ఎదిగాడు.

మోసం చేస్తూ పోయిన భీమయ్యకు మటుకు పెట్టుబడి కరువౌతూ వచ్చింది. కొద్ది సంవత్సరాల తర్వాత అతని పొలంలో పంటలు అస్సలు బాగా పండలేదు. తనను వదిలేసి సొంతంగా వ్యవసాయం చేసుకుంటున్న రామయ్యను సహాయం అడిగేందుకు ఇప్పుడు అతనికి ముఖం చెల్లలేదు. తప్పు తెలుసుకొని బాధ అయితే పడ్డాడు కానీ, ఇప్పుడిక ఏమి ప్రయోజనం?!

# పరుగో పరుగు

బొమ్మల కథ

*రచన: ఇ.నాగేంద్ర, ఎనిమిదవ తరగతి, జడ్.పి.హెచ్.యస్.స్కూల్, కోగిర గ్రామం, రొద్దం మండలం, అనంతపురం జిల్లా.*



అనగనగా ఒక అడవిలో ఒక కుందేలు ఉండేది. దాని పేరు శశకం. ఒక రోజున అది మెల్లగా షికారుకు బయలుదేరింది.

"ఓయ్.. శశకం, జాగ్రత్త! మన అడవిలోకి భల్లూకం అని ఓ ఎలుగుబంటి కొత్తగా చేరుకున్నది. అది నీలాంటి చిన్న జంతువుల్ని చాలానే ఏడిపిస్తున్నదని విన్నాను" అన్నది చెట్టు మీదున్న కోతి-మర్కటం మామ.

"అది నన్నేమీ అనదులే, మామా! అయినా నేను ఎక్కువ దూరం పోను" అన్నది శశకం.



అంతలోనే తడుముకుంటూ దాని మీదికి వచ్చేసింది భల్లూకం. వికటంగా నవ్వుతూ "దొరికావు! రెండు రోజులనుండీ నీ కోసమే చూస్తున్నాను. ఇవాళ్ళ నా ఆహారం నువ్వే!" అన్నది.

కుందేలు గజ గజ వణికింది. దానికి ఒళ్ళంతా చెమటలు పట్టాయి. చేతుల్తో విసురుకోవటం మొదలు పెట్టింది. గబ గబా ఆలోచించింది.



"నువ్వు ఏ కుందేలు కోసం చూస్తున్నావు? చెమట పట్టిన కుందేలు కావాలా, చెమట లేని కుందేలు కావాలా, నీకు?" అని అడిగింది ఎలుగుబంటిని.

"చెమట పట్టింది నాకెందుకు? చెమట లేని మంచి కుందేలే కావాలి నాకు!" అన్నది భల్లూకం.

"మరైతే ఈ చెట్టును ఊపు. కొంచెం గాలి తెప్పించు. నిన్ను చూసేసరికి భయంతో నాకు చెమటలు పట్టిపోతున్నాయి" అన్నది కుందేలు, చెట్టుమీద ఉన్న మర్కటం మామకు సైగ చేస్తూ.

ఎలుగుబంటి తన బలం చూపించుకుందామనుకున్నది. కొబ్బరి



చెట్టు మొదలును పట్టుకొని దబగబా ఊపింది.

చెట్టు జుయ్ జుయ్ మని ఊగింది. చెట్టుమీద ఉన్న మర్కటం మామ కూడా చెయ్యి చేసుకున్నాడు.



దాంతో కొబ్బరి బోండాలన్నీ జలజలా రాలాయి. మూడునాలుగు కాయలు వచ్చి నేరుగా భల్లూకం తలమీదే పడ్డాయి. దెబ్బకు ఎలుగుబంటి దిమ్మ తిరిగి పడిపోయింది.

తేరుకున్న శశకం పరుగో...పరుగు!

## సెలవుల్లో ఏం చేస్తారు?

కొత్తపల్లి సెట్లు తెప్పించుకోండి! కథలన్నీ చదివెయ్యండి! సొంతంగా కథలు రాయండి!! బొమ్మలు వేయండి!!

స్వాగతం!

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !



# ముందు చూపు

*రచన: డి.ఆశ, ఏడవ తరగతి, పి.వి.ఆర్. జడ్.పి.హెచ్ స్కూల్, గుండువారి పల్లి, అనంతపురం జిల్లా*

అనగనగా దట్టమైన ఒక అడవి ఉండేది. చాలా పెద్ద అడవి అది. పెద్ద పెద్ద చెట్లు, రకరకాల పక్షులతో అది ఎప్పుడూ కళకళలాడుతూ ఉండేది.

అందులో ఒక పెద్ద చెట్టు మీద నివసించేవి, నెమలి, చిలుక, కోడి. ఆ మూడూ మంచి మిత్రులు.

ఆ సంవత్సరం విపరీతమైన ఎండలు కాసాయి. జంతువులు త్రాగే నీళ్ళకు కూడా సమస్యగా ఉంది. అట్లాంటి ఆ సమయంలో దూరంగా- అడవికి అటు ప్రక్కన- దట్టంగా పొగ వెలువడటం గమనించింది నెమలి.

"ఏమిటా పొగ? మంట కాదుగదా?!" అన్నది అనుమానంగా.

"అయిఉండచ్చు..." అన్నది చిలుక

"మన దగ్గర కాదులే, పట్టించుకోకండి!" అన్నది కోడి.

"కాదు. వెళ్ళి చూసి రావాలి! అది నిజంగానే మంట అయి ఉండచ్చు. గాలి ఇటే వీస్తున్నది. కొంచెం వెచ్చగా, కమురు వాసనతోటి ఉన్నది గాలి!" అన్నది నెమలి.

"కానీలే, అది మన వరకూ వచ్చినప్పుడు

చూసుకుందాం!" అన్నది చిలుక.

అయినా నెమలి ఆగలేదు. పొగ వెలువడుతున్న ప్రాంతం చాలానే దూరంగా ఉన్నది. అయినా అది అక్కడి వరకూ ఎగిరి వెళ్ళి చూసింది. నిలువెత్తు మంటలతో, రేగిన కార్చిచ్చుతో అక్కడ అంతా భీభత్సంగా ఉన్నది.

వెనక్కి తిరిగి వచ్చిన నెమలి పెట్టే బేడా సర్దుకుంటూ చిలుక, కోడిలతో అన్నది: "మీరు కూడా బయలు దేరండి. మనం ఇక ఇక్కడ ఉండటం భద్రం కాదు. ఏ రోజునైనా మనం ఉండే ఈ ప్రదేశం అంతా తగలబడిపోతుంది. ఇక్కడ ఉంటే మనం, మన పిల్లలు అందరం మాడి మసి ఐపోతాం!" అని.

"అయ్యో! అంత తొందరేమీ లేదులేమ్మా! సమస్య అసలు ఇక్కడి వరకూ రాకపోవచ్చు. మన ప్రాంతం ఖచ్చితంగా తగలబడుతుందని నమ్మకమేంటి? ఊరికే పిల్లల్నీ జెల్లల్నీ వెంట వేసుకొని కాని ప్రాంతాలకు వలస పోవటం బరువు కదా; అంతదాకా వస్తే అప్పుడు చూడచ్చులే!" అన్నది చిలుక.

"అవును. అసలు మన ప్రాంతం ఏనాడూ తగలబడలేదు. ఇప్పుడూ ఏమీ కాదు!" అన్నది కోడి.



"లేదు. నేను మాత్రం నిలిచేది లేదు. మా పిల్లల్ని తీసుకొని ఆ కొండల అవతల ఉన్న సరస్సు దగ్గరికి పోతున్నాను. మీరూ నాతో పాటే రావాలని నా కోరిక. రండి. కలిసి పోదాం!" అన్నది నెమలి.

చిలుక, కోడి కదలలేదు. నెమలి గట్టిగా నిట్టూర్చి, తన పిల్లల్ని తీసుకొని సరస్సు దగ్గరికి వెళ్ళిపోయింది.

కొన్ని రోజులు గడిచాయి. ఒక రోజు సాయంత్రం అవుతుండగా చిలుక తన గూటి చుట్టూ నీళ్ళు చల్లి, గబగబా సామాన్లు సర్దటం మొదలు పెట్టింది.

"ఏమైంది?!" అన్నది కోడి.

"అడవి తగలబడుతున్నది! మన ప్రాంతానికి ఇంకా రాలేదు గానీ, అటు గుట్ట అవతల మొత్తం తగలబడుతున్నది. రాత్రి ఏదో ఒక సమయానికి మంట ఇటు వచ్చేస్తుంది!! గాలి కూడా బలంగా ఉంది. పద- పిల్లల్ని కదుల్చు! రెండు మూడు సార్లు తిరిగితే తప్ప అందరం అవతలికి చేరుకోలేం! ఇప్పటికే ఆలస్యం అయింది!" అన్నది చిలుక హడావిడి పడుతూ.

"ఊరుకో. మంట ఇటు వైపుకు రాదు. కావాలంటే నువ్వు పో!" అన్నది కోడి, నిద్రకు ఉపక్రమిస్తూ.

చిలుక గూటి చుట్టూ నీళ్ళు చల్లి, తన పిల్లల్లో కొన్నిటిని తీసుకొని ఎగిరింది. వాటిని దూరంగా వదిలి వెనక్కి వచ్చేసరికి మంటలు చుట్టూతా బాగా క్రమ్ముకున్నాయి. మిగిలిన పిల్లల్ని పట్టుకుని ఎగరబోయిన చిలుకకు ఎటు పోయినా మంటలే ఎదురయ్యాయి. అయినా పిల్లల్ని వదలక, అది ఎలాగో ఒకలాగా, సగం కాలిన రెక్కలతో బయటపడిందది.

మొండి తనం కొద్దీ, బద్ధకానికి లోనై గూటిలోనే కునుకుతూ కూర్చున్న కోడి మటుకు మంటల్లో మాడి మసైపోయింది!

ప్రాణాంతకమైన సమస్యల గురించి ముందుచూపుతో వర్తించటం *ఉత్తమం*.

సమస్యలు వచ్చి చుట్టుముట్టాక బుద్ధిచాతుర్యంతో బయట పడటం *మధ్యమం*.

ఇక 'ఏమీ కాదులే' అని అలసత్వంతో చేతులు ముడుచుకొని కూర్చోవటం *అధమం*.

ఉత్తమమైన పనులు చేద్దాం. తప్పకపోతే మధ్యమంగా ఉందాం. అధములుగా మటుకు ఏనాడూ ఉండద్దు.

**నవ్వు!**

ఐదవ తరగతి చదివే వెంగళప్ప బడికి నిచ్చెన తెచ్చుకున్నాడు

టీచర్: ఎందుకురా వెంగళప్పా! నిచ్చెన తెచ్చుకున్నావు?

వెంగళప్ప: మరి హైస్కూల్‌కి పోవాలని మీరే కద టీచర్ చెప్పింది!?



# ప్రాణం కాపాడిన స్టేప్లర్

*రచన: నియతి శ్రీ శేష, 7th గ్రేడ్, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

సూర్యుడు తన కిరణాలను బాస్కెట్ బాల్ ఆటస్థలం మీదకు సూటిగా వదులుతున్నాడు. మా ప్రాంగణంలో ఉన్న బాస్కెట్ బాల్ ఆటస్థలం చాలా పెద్దది. దాని చుట్టూ కంచె కూడా లేదు. అందుకని అక్కడ సూర్య దేవుడే కాదు; వాయుదేవుడు కూడా చాలా బలంగా వీస్తూ ఉంటాడు.

నేను ఆరోజు ఉదయాన్నే అక్కడ బాస్కెట్ బాల్ సాధన చేస్తున్నాను. బాస్కెట్ చాలా ఎత్తులో ఉంది- నేనేమో ఇంకా చిన్నదానినే; అందుకని బంతిని బాస్కెట్ లో పడేట్లు వేయటం పెద్ద పనిగా ఉంది. ఒక్కోసారి బంతి బాస్కెట్ వరకూ పోకుండానే క్రింద పడిపోతున్నది. ఒక్కోసారి అది బాస్కెట్టును దాటి బయటికి పడి పోతున్నది.

'ఇట్లా కుదరదు' అని గట్టిగా అరిచి నేను బంతిని బలంగా విసిరాను. ఆ బంతి వేగంగా పోయి బాస్కెట్ ఉన్న బల్లకు తగిలింది-

అంతే వేగంగా వెనక్కి తిరిగి వస్తూ ఓ చెట్టుకు కొట్టుకున్నది- ఎగిరి మరో వైపున ఉన్న కాలవలో పడింది!

నేను గబుక్కున పోయి కాలువలోకి చూశాను.. కాని అక్కడ నా బంతి కనబడలేదు! "ఏమైందది, ఇక్కడే పడిందే?"

అంతలో నాకు అక్కడ ఒక ఎర్ర కాగితం కనబడ్డది- దాని మీద ఏదో రాసి ఉన్నది..

తీసుకొని చదివాను. అందులో ఇలా ఉంది:

"నియతీ, నువ్వు నీ బంతి కోసం వెతుకుతున్నావు కదూ?! నాకు తెలుసు. నేను దాన్ని చూశాను, తీసుకు వెళ్తున్నాను. నీకు నీ బంతి అంటే చాలా ఇష్టం కదూ?! మరి అంత మంచి బంతి, నీ బంతి నీకు కావాలంటే ఏం చేయాలి? శివుడి గుడికి రా, ఇవాళ్ల రాత్రి పదింటి కల్లా. పది కంటే ముందుగా వస్తే లాభం ఉండదు- ఎందుకంటే తొమ్మిది గంటల సమయంలో అక్కడ చాలా మంది మనుషులు ఉంటారు కదా, అంతమంది మనుషుల్లో నేను ఎవరో నీకు తెలియదు మరి. అందుకని పది గంటలకే రావాలి.

అక్కడ చాలా చెట్లు ఉంటాయి తెలుసుగా? అయితే వాటిలో కేవలం ఒకే ఒక చెట్టు మీద సముద్రం రంగు గాలిపటం ఒకటి ఎగురుతూ ఉంటుంది. దాని దగ్గరకు రా.

ఇంకో సంగతి- అక్కడంతా నల్ల పిల్లులు, పాములు తిరుగుతూ ఉంటాయి. అందుకని జాగ్రత్తగా ఉండు- ఎక్కువ కదలకు మరి, ఉంటాను"

నేను విచారంగా ఇంటికి నడిచాను. నడుస్తూ నడుస్తూ దారిలో చాలాసార్లు ఊరికెనే నిలబడిపోయాను. ఉత్తరం గురించి ఆలోచించాను. మొదట ఒకసారి "ఆ ఉత్తరాన్ని ఎవరో నవ్వులాటకు వదిలిపెట్టి ఉంటారు- వేరే ఎవరికోసమో అయి ఉంటుంది.." అనుకున్నాను.

తర్వాత అనిపించింది: "కాదు- ఉత్తరం రాసిన వాళ్ళకు నేను తెలుసు. నా పేరు తెలుసు. నా బంతి పోయిన సంగతీ తెలుసు.."

ఒక విషయం నన్ను చాలా చికాకు పెట్టింది: "వీళ్ళెవరోగానీ నా బంతిని ఎత్తుకుపోయారు- అంటే దొంగలన్నమాట.

మరి ఆ దొంగ మనుషులకి నా పేరు ఎలాతెలిసింది?!.."

కానీ మళ్ళీ ఓసారి ఉత్తరం చదివినప్పుడు వాళ్లెవరో మంచివాళ్లలాగానే అనిపించారు- ఏమంత దొంగలు కాదేమో. నా బంతిని ఊరికే నవ్వులాటకి తీసుకున్నారేమో..!"

"నా బంతి నాకు కావాలమ్మా" అనుకున్నాను గట్టిగా "నా బంతి-నా హక్కు. దానికోసం నేను ఎక్కడికైనా వెళ్తాను"

ఇంటికి వెళ్ళినప్పుడు అమ్మ "బంతి ఏది?" అని అడిగింది. చెప్పక తప్పలేదు. నేను ఉత్తరం సంగతి చెప్పేసరికి మా అమ్మ తల చేతుల్లో పెట్టుకుని కూర్చుంది: "నాకు చాలా భయంగా ఉంది నియతీ! నువ్వు అస్సలు వెళ్లటానికి లేదు!" అంది.

నాకు చాలా కోపం వచ్చింది. "ఏమీ అవ్వదు- నేను వెళతాను!" అనుకున్నాను.

ఆ రోజు రాత్రి అందరూ నిద్రపోయేవరకు ఆగాను.

తరువాత మెల్లగా బీరువాలోనుండి ఫ్లాష్ లైట్ తీసుకున్నాను. చప్పుడు చేయకుండా వెళ్ళి, నా స్టేషనరీ అలమారలోకి చూసాను. నా ప్రత్యేకమైన స్టేప్లర్‌ను బయటికి తీశాను. నిజంగానే అది చాలా ప్రత్యేకమైన వస్తువు. దానిలో స్టేప్లర్ ముక్కలు ఉండవు- పొడవాటి వైరుచుట్ట ఒకటి ఉంటుంది. దాన్ని నొక్కగానే ఆ వైరు కొస ఒకటి మెరుపు వేగంతో ముందుకు దూకుతుంది. కాగితాల దొంతర ఎంత లావున్నా సరే, దాన్ని పొడుచుకుంటూ ముందుకు సాగుతుంది. చివరికంటా పోగానే, మనం లాగినప్పుడు మళ్ళీ అంత వేగంతోటీ వెనక్కి వచ్చి తెగిపోతుంది!

నేను గుడి దగ్గరికి మెల్లగా నడిచాను. అక్కడ అంతా చాలా చీకటిగా ఉంది. నా ఫ్లాష్‌లైటు వెలుతురును అక్కడి చెట్లన్నిటి మీదికీ ప్రసరింపజేసాను.

అంతలో అకస్మాత్తుగా అక్కడ ఒక మనిషి కనిపించాడు- అతని చేతిలో నా బాస్కెట్ బాల్ బంతి ఉన్నది! "ఇతనెప్పుడు వచ్చాడు, ఇక్కడికి? ఇంతవరకూ నాకు కనిపించలేదేమి?-"

ఆ మనిషి వెనక ఉన్న చెట్టు మీద సముద్రం

రంగు గాలిపటం ఒకటి ఎగురుతూ కనిపించింది. "ఇతనే. ఉత్తరంలో రాసాడు ఇవన్నీ?!" అనుకున్నాను.



నేను అతని దగ్గరికి వెళ్ళి ఏమాత్రం భయం లేకుండానే అతనితో కొంచెం సేపు మాట్లాడాను. అతని చేతిలో ఉన్న బంతిని అందుకోబోయాను. అంతలోకే ఒక గోతాం సంచీ లాంటిదేదో నా తలమీదకు పడింది. కొంచెం సేపు నేను దాన్ని తీసేసేందుకు ప్రయత్నించాను.. "ఆ తర్వాత ఏమైంది?"

ఏమో తెలీదు- కొంతసేపటి తరువాత చూసుకుంటే నేను ఒక గదిలో ఉన్నాను. నా తలమీద ఇంకా గోతాం సంచీ అలానే ఉంది. అంతలో అడుగుల శబ్దం అయ్యింది. ఆ మనిషి నా దగ్గరికి వచ్చాడు. నా తల మీదినుండి గోతాన్ని తీసేసాడు.

"ఎందుకు, ఇట్లా చేస్తున్నావు?" అని అరిచాను నేను.

"లేకపోతే నీకు గాలి సరిగ్గా ఆడట్లేదు; చెమట పోస్తున్నది; నువ్వు ఏమీ మాట్లాడట్లేదు- అందుకని!" అన్నాడు అతను నింపాదిగా. అతని ముఖంలో ఒకలాంటి విషం కనిపించింది. "నువ్వు 'పోయావు' అని మీ తల్లిదండ్రులకు రాస్తాను. వాళ్ళు నాకు రెండు కోట్లు ఇస్తేనే నేను నిన్ను వదిలేది!" అని పెద్దగా నవ్వాడు.

"నేను ఊరుకునేది లేదు. నిన్ను జైల్లో పెట్టిస్తాను. ఏం చేస్తానో చూడు" అని నేను కోపంతో అరిచాను.

అతను మాత్రం నవ్వుతూనే ఉన్నాడు. "నువ్వంటే నాకు చాలా ఇష్టం నియతీ! ఎందుకంటే నువ్వే కద, నా రెండు కోట్లు?!"

అని మళ్ళీ నవ్వాడు గట్టిగా.

'వాడు నన్ను చంపేస్తాడేమో' అని భయం వేసింది నాకు. "కానీ అట్లా చెయ్యడు- ఎందుకంటే వాడికి డబ్బులు కావాలి. అమ్మానాన్నలకి ఫోన్ చేసి ఉంటాడు వాడు. వాళ్ళు వచ్చి డబ్బులు ఇచ్చేంతవరకూ నన్ను జాగ్రత్తగానే చూసుకుంటాడు" అనుకున్నాక కొంచెం నిద్రరావటం మొదలైంది. నేను మెల్లగా వెతుక్కున్నాను- నా ఫ్లాష్‌లైటు కనిపించలేదు గానీ స్టేప్లర్ మటుకు నా జేబులోనే భద్రంగా ఉన్నది- అంతవరకూ మేలే.

నేను పొద్దున్నే లేచే సరికి ఒక అబ్బాయి ఎవరో నా గదిని శుభ్రం చేస్తున్నాడు. వాడి చేతిలో ఒక పళ్ళెమో ఏదో ఉన్నది. "మీ అమ్మా, నాన్నా మంచివాళ్ళు. వాళ్లు డబ్బుతో వస్తున్నారట. వీడు నన్ను పట్టుకొచ్చినప్పుడైతే మా అమ్మా-నాన్నా అసలు రానే లేదు. దాంతో వీడు నన్ను ఇట్లా పనిమనిషి లాగా పెట్టుకున్నాడు. పనివాడి అవసరమే లేకపోతే అసలు చంపేసి ఉండేవాడేమో" అన్నాడు వాడు. నేను అసహ్యించుకుంటూ "హుఁ!" అన్నాను.

ఐదు నిముషాల తరువాత మళ్ళీ మొదటివాడు వచ్చాడు- "నీకు ధన్యవాదాలు చెప్పడానికి వచ్చాను. నువ్వు అంత బుర్ర లేనిదానివని తెలియలేదు. ఒక్క చిన్న బంతికోసం నా దగ్గరికి వస్తావని అస్సలు అనుకోలేదు నేను. ఉత్తరం చూసుకొని వచ్చినందుకు థాంక్స్. ఇప్పుడు నేను కొత్త ఇల్లు కొనుక్కోవచ్చు; కొత్త ఫ్యాక్టరీ పెట్టుకోవచ్చు- అంతా నీవల్లే!" అని పెద్దగా నవ్వాడు.

అకస్మాత్తుగా నాకు ఓ ఐడియా తట్టింది. నేను కూడా నవ్వుతూ ఆయన దగ్గరికి వెళ్లాను- "నీకు కూడా ధన్యవాదాలు చెప్పాలి- నువ్వు నన్ను ఏమీ చేయలేదు" అని అనేసి, వాడు ఇంకేదో అనేలోగా నా స్టేప్లర్‌తో వాడి పొట్టకు గట్టిగా ఒక పిన్ను వేసేసాను.

స్టేప్లర్లోంచి బయటికొచ్చిన వైరు వాడి పొట్టలోంచి దూరి, వీపులోంచి బయటికొచ్చింది; మళ్ళీ వీపులోంచి దూరి పొట్టలోకి...! కళ్ళుమూసి తెరిచేంతలో

జరిగిపోయిన ఈ పనికి వాడు కళ్ళు తేలేసాడు. రాక్షసుడిలాగా అరుస్తూ, అటూ ఇటూ గెంతుతూ, వాడిలోకి దూరిన వైరును లాక్కునే ప్రయత్నం చేసాడు. వాడెంత ప్రయత్నం చేస్తే వైరు అంత గట్టిగా బిగుసుకున్నది.



ఆ టైములో వాడి చేతికి దొరికి ఉంటే నా పని అయిపోయేది. నేను తప్పించుకొని ఒక్క దూకున కిందికి వెళ్ళి రోడ్డు వరకూ పరుగెత్తాను. అటుగా పోతున్న ఓ ఆటోను పిలిచి, తొందర తొందరగా నా అడ్రస్స్ చెప్పేసి ఆటో ఎక్కాను.

ఆటోలో పోతూ నేను అమ్మ గురించి ఆలోచించాను. "తన మాట విని ఉంటే ఇదంతా జరిగేది కాదు.."

అంతలో మా ఆటోకి అటువైపుగా ఒక కారు పోతూ కనిపించింది. మా అమ్మా-నాన్నా అందులో ఉన్నారు. నేను ఆటోలోంచి కేకలు పెట్టే సరికి వాళ్ళు వెనక్కి తిరిగి వచ్చారు. నన్ను చూసి సంతోషంతో ఏడుస్తూ ఉన్నారు వాళ్ళు. వాళ్లకి సంగతంతా చెప్పగానే నాన్న పోలీసులకు ఫోను చేసి సంగతంతా వివరించాడు. "మీ అమ్మాయి స్టేప్లర్ వేసి మంచిపని చేసింది. వాడిప్పుడు ఎక్కడికీ పోడు. మిగిలిన సంగతి మేం చూసుకుంటాం-మీరు ఇంటికి పోండి" అన్నారు పోలీసులు.

ఆటో డ్రైవర్ కి డబ్బులు ఇచ్చి నన్ను ఇంటికి తీసుకెళ్ళారు అమ్మ వాళ్ళు. ఇల్లు చేరాక క్షమించమని అడిగాను మా అమ్మను. "నేను ఎప్పుడూ నీమాట వింటానే, ఇంకెప్పుడూ ఇట్లా చెయ్యను" అని మా అమ్మకు చెప్పాను. ★



# సహాయం

*రచన: బోయిని అజయ్, 9 వ తరగతి, జడ్.పి.హెచ్.స్కూల్, ముస్తాబాద్, కరీంనగర్ జిల్లా, తెలంగాణ.*

ఆవునూర్‌లో ఉండే పోశవ్వకు డెబ్బై ఏళ్ళు. ఆమెకు ముగ్గురు కూతుళ్లు. ఇద్దరు కొడుకులు. అందరికీ పెళ్ళిళ్లు అయ్యాయి; కానీ ఈ మధ్యనే అకస్మాత్తుగా కొడుకులు ఇద్దరూ చనిపోయారు. దాంతో పోశవ్వ చాలా దు:ఖంలో ఉంది.

'పులిమీద పుట్ర' లాగా, సరిగ్గా అదే సమయంలో ఆమె నివసించే పూరిగుడిసె కాస్తా కూలిపోయింది. పోశవ్వకు ఇక ఏం చేయాలో తోచలేదు. తన పుట్టింటివాళ్ళు పెట్టిన నగల్లో కొన్నింటిని బిడ్డలకు ఇవ్వగా, మిగిలిన కొన్ని ఆమె ఒంటి మీదే ఉన్నాయి.

ఆమె వాటిని ఖర్చు చేయలేదు. అంత వయసు వచ్చినా కూలికి పోయి తన బ్రతుకు తాను బ్రతుక్కుంటూనే ఉన్నది తప్ప, బంగారం అమ్ముకోలేదు. ఇప్పుడు ఉన్న ఈ గుడిసె కూడా పోతే, తను ఇక ఎక్కడ ఉండాలి?

పోశవ్వ ఇక చేసేదేమీ లేక చిన్న కూతురు ఇంటికి వెళ్లింది. ఆమె చిన్న కూతురు పేదరాలు- కూలికి పోతే తప్ప పూట గడవదు. అందుకని ఆమె తల్లిని ఇంట్లో వదిలి పనికి పోయింది.

పోశవ్వ ఒంటరిగా ఇంటి బయట మంచం మీద కూర్చొని చూస్తూ ఉంది. ఆమెకు పాపం ఆకలిగా ఉంది. ఇంట్లో ఏమీ ఉన్నట్లు లేవు- తన ఇంట్లో అయితే ఏదో ఒకటి చేసుకొని తినేది. కానీ ఇది కూతురి ఇల్లాయె! ఊరుకోలేని పోశవ్వ ఊరికే తనలో తాను ఏదో గణగణా గొణుక్కోవటం మొదలుపెట్టింది.

సరిగ్గా ఆ సమయానికి అటుగా పోతున్నాడు రాజం అనే విద్యార్థి ఒకడు. పోశవ్వ మాటలు విన్న రాజం ఆమె దగ్గరకి వచ్చి "ఏమైందవ్వా? ఏంటి ఊరికే గొణుక్కుంటున్నావు?" అని అడిగాడు. బాగా ఆకలి మీద ఉన్న పోశవ్వ సంగతంతా చెప్పి "ఏదో, ముసల్ది కదా, తింటుంది అని కొంచెం కూడా అన్నం వదిలిపెట్టకుండా పోతే, ఇక నేను తినేది ఎలాగ, బతుక్కునేది ఎలాగ నాయనా, చెప్పు?!" అన్నది.

రాజం కరిగిపోయాడు. తన బాక్సులో ఉన్న టిఫిన్ తీసి, పోశవ్వకు ఇచ్చి తినమన్నాడు. ఆకలిగొన్న పోశవ్వ గబగబా తిన్నది. రాజం ఖాళీ బాక్సుతో బడికి వెళ్ళిపోయాడు.

మరుసటి రోజున రాజం బాక్సులో పులిహోర తెచ్చుకున్నాడు. దారిలో ఆగి పోశవ్వకు బాక్సు ఇచ్చి తినమన్నాడు. "మరి నీకు ఎలాగ నాయనా?!" అడిగింది పోశవ్వ. మాకు బడిలో భోజనం పెడతారులే అవ్వా! మాకేమీ సమస్య లేదు- నువ్వు కడుపు నిండా తిను చాలు" అన్నాడు రాజం.

మూడో రోజున కూడా ఇలాగే జరిగింది. పోశవ్వకు చాలా సిగ్గుగా అనిపించింది. నాలుగో రోజున ఆమె వాడిని దగ్గరికి పిలిచి, "చూడు రాజం, నీకు ఈ సంవత్సరం పరీక్ష

ఫీజు ఎంతవుతుంది?" అని అడిగింది. "ఒక ఐదారు వందలు అవుతుందవ్వా" అన్నాడు రాజం. సరే, అయితే ఈసారి నీ ఫీజు నేను కడతాను. సరేనా? ఇప్పటికి ఈ వంద రూపాయలు ఉంచు. పాపం నీకోసం తెచ్చుకున్నదంతా నాకు పెడుతున్నావు" అన్నది.

రాజం బాగా మొహమాట పడ్డాడుగానీ, పోశవ్వ బలవంతం చేసే సరికి 'సరే' అనక తప్పలేదు. రాజంకు తన అమ్మమ్మ అంటే చాలా ఇష్టం. అయితే ఆవిడ రాజం చిన్నగా ఉండగానే పోయింది. రాజంకు పోశవ్వను చూస్తే తన అమ్మమ్మని చూసినట్లు ఉండేది. దాంతో వాళ్ళ అమ్మ తను ఇంటర్వెల్‌లో తినేందుకు పెట్టిన దోశ, చపాతి లాంటి టిఫిన్లను బడికి తీసుకెళ్లకుండా పోశవ్వకు ఇచ్చేసేవాడు. బడిలో తనకు ఎలాగూ మధ్యాహ్న భోజనం పెడతారాయె!

ఇలా కొన్ని రోజులు గడిచాయి. ఒకరోజున రాజం వచ్చేసరికి పోశవ్వ ఇంట్లో ఉన్నది. ఆమె కూర్చున్న కుర్చీ ఇంటి కిటికీ లోంచి కనబడుతున్నది. ఆమె ప్రక్కన ఎవరో కుర్రాడు నిలబడి ఉన్నాడు. వాడి చేతిలో ఒక కత్తి- ఆ కత్తిని వాడు పోశవ్వ మెడకు ఆనించి ఉన్నాడు! పోశవ్వ ఏడ్చుకుంటూ తన నగల్ని తీసి వాడి చేతులో పెడుతున్నది!

వెంటనే రాజం సమయస్ఫూర్తితో పోశవ్వ ఉండే ఇంటికి బయటినుండి గొళ్లెం వేసి, పోలీసులకు ఫోన్ చేసాడు.

లోపల ఉన్న దొంగ ఇదంతా గమనించే స్థితిలో కూడా లేడు. వాడు పోశవ్వ ఒంటిమీద నగలన్నీ ఒలుచుకొని, మూటగట్టుకొని 'ఇక బయటపడుదాం' అనుకునేసరికి పోలీసులు గబగబా లోనికి వచ్చి వాడిని చుట్టు ముట్టేసారు!

పోలీసులు పోశవ్వ కూతురును పిలిపించి, నగల్ని ఆమెకు అప్పజెప్పారు. "ఈ పిల్లాడు అనుమానించి మాకు ఫోన్ చేసాడు కాబట్టి దొంగ దొరికాడు. లేకపోతే ఏమయ్యేది? ముసలివాళ్ళు మీద నగలు అట్లా వదిలి పోతారా?!" అని తిట్టారు. ఆ రోజు సాయంత్రం పోలీసు అధికారులు రాజంని అభినందించి ఐదు వందల రూపాయలు బహుమతిగా ఇచ్చారు!

మరునాడు ఎప్పటిమాదిరే పోశవ్వకోసం టిఫిన్ డబ్బా పట్టుకొచ్చాడు రాజం. అయితే ఆమె ఉండే ఇంటికి తాళం పెట్టి ఉన్నది- పోశవ్వ మళ్ళీ తన ఊరికి వెళ్ళిపోయిందట! ఆమె బిడ్డ కూలికి పోయింది.

రాజం మనసంతా వెలితిగా అనిపించింది.



పోశవ్వ వాళ్ల ఊరు వెళ్ళి కలుద్దామను-కున్నాడు గానీ, తను పదవతరగతిలో ఉన్నాడు; చదవవలసింది చాలానే ఉన్నది. "సెలవల్లో వెళ్తాను" అని నిశ్చయించుకున్నాడతను.

అంతలో పరీక్ష ఫీజు కట్టే సమయం దగ్గర పడింది. ఫీజు ఆరువందల రూపాయలు. రాజం తల్లిదండ్రులు "ఒక్కసారిగా అంత డబ్బా?!" అన్నారు. పోశవ్వ తనకిచ్చిన వంద రూపాయలు, పోలీసులు ఇచ్చిన బహుమతి ఐదు వందలు గుర్తుకొచ్చాయి రాజంకు. ఆ డబ్బులు కట్టి, బాగా చదివి, చక్కగా, ధైర్యంగా పరీక్షలు రాసాడు.

పదవతరగతిలో రాజంకు 10 GPA వచ్చింది! జిల్లాలోనే అతనిది ప్రథమ స్థానం! బడిలో అధ్యాపకులు, జిల్లా అధికారులు అందరూ అతన్ని అభినందిస్తూ పదివేల రూపాయలు బహుమతిగా ఇచ్చారు!

రాజంకు చాలా తృప్తిగా అనిపించింది. వాళ్ల అమ్మానాన్నలకు పోశవ్వ గురించి చెప్పి "ఆ అవ్వ ఇచ్చిన డబ్బులే లేకుంటే నేను పరీక్షలు రాయకనేపోదును. ఆమె ఆశీస్సులే నాకు ఈ రోజున పదోతరగతిలో ర్యాంకు తెప్పించాయి- వాళ్ల ఊరు వెళ్ళి ఆమెను కలిసి వద్దాం, రండి" అని వాళ్లని పిల్చుకొని

పోశవ్వ వాళ్ళ ఊరికి వెళ్ళాడు.



అయితే వీళ్ళు వెళ్ళేసరికి పోశవ్వ ఆసుపత్రిలో ఉందని తెలిసింది! ఆమెకు రక్తం కూడా కావలసి ఉంది! దీంతో రాజం తనకు తెలిసిన సార్లకు ఫోన్ చేసి, పోశవ్వ రక్తం గ్రూప్ చెప్పి, రక్తం తెప్పించాడు. ఆ రక్తం ఎక్కించాక పోశవ్వ ఆరోగ్యం మెరుగయింది. హాస్పిటల్ ఖర్చును కూడా తానే కట్టి రాజం ఆమెను తమ ఇంటికి తీసుకెళ్లాడు.

అలా పోశవ్వకు తనను ప్రేమించే మనవడు ఒకడు దొరికాడు. రాజంకు ఒక అమ్మమ్మ దొరికింది.

పై చదువుల్లో కూడా మంచి ఫలితాలు సాధించాడు విజయ్. కోరిన ఉద్యోగం సాధించి జీవితంలో ఒక స్థాయికి చేరుకున్నాడు. అటుపైన ముసలివారికి సేవ చేయటం కోసం చక్కని ఓ వృద్ధాశ్రమం కూడా నిర్మించాడు. ★

నవ్వు!

**ఒట్టి ప్రార్థన!**

వెంగళప్ప రోజూ దేవుడిని ప్రార్థిస్తున్నాడు. "దేవుడా! కనీసం ఇవాళ్లన్నా నాకు లాటరీ తగిలేట్టు చూడు" అని. నెలలు సంవత్సరాలైనై. కానీ వెంగళప్పకి లాటరీ మాత్రం తగల్లేదు.

చివరికి దేవుడికి విసుగొచ్చింది-

ప్రత్యక్షమై "ఒరేయ్! ప్రార్థన చాలురా! ముందు కనీసం ఒక్క లాటరీ టిక్కెట్టయినా కొనరా!" అని అరిచాడు గట్టిగా.



# అన్నదమ్ముల కథ

తెలుగు జానపద కథ

*సేకరణ: ఎస్.బ్లెస్సీ, ఏడవ తరగతి* *సౌజన్యం : మనలైబ్రరీ, జహీరాబాదు*

రామాపురంలో నివసించే పర్వతాలుకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు చాలా తెలివైనవాడు. చిన్నవాడు అమాయకుడు. పర్వతాలు తన జీవితంలో పెద్దగా ఏమీ కూడబెట్టలేదు గానీ, కొద్ది రోజులలో చనిపోతాడనగా అతనికి ఒక చింత పట్టుకున్నది- "పెద్దవాడు చిన్నవాడిని మోసం చేస్తాడేమో, ఇద్దరూ కలిసి బ్రతుక్కునే విధానం చూడాలి" అని.

అదే బెంగతో అతను మంచం పట్టాడు. చివరికి చనిపోబోతుండగా అతను పిల్లలిద్దరినీ పిలిచి, ఇద్దరికీ తన ఆస్తులైన మామిడి చెట్టు, ఆవు, ఒక కంబళి చూపించి- "వీటిని మీరిద్దరూ అనుభవించాలి!" అని సైగలు చేసి చెబుతూ కన్నుమూసాడు.

మరుసటి రోజున పెద్దవాడు తమ్ముడిని పిలిచి "ఒరే, తమ్ముడూ! నాన్న మనకు ఒకే చెట్టు, ఒకే ఆవు, ఒకే కంబళి ఇచ్చాడు కదా; వాటిని మనం ఎలా పంచుకుందా-మంటావు?" అని అడిగాడు.

"వాటిని అమ్మి చెరిసగం తీసుకోవచ్చుగానీ,

మనం అట్లా చేయకూడదు. స్వర్గంలో ఉన్న నాన్న ఆత్మ సంతోషపడాలంటే మనం వీటిని కలిసి అనుభవించాలి" అన్నాడు తమ్ముడు.

"అదేరా, నేను చెప్పేది కూడాను. వీటిని మనం ముక్కలు చేయకూడదు- కనుక వాటిని కలసి ఉపయోగించుకుందాం. చెట్టు మొదలు *నీకు*, పై భాగం నాకు. అట్లాగే ఈ కంబళిని *పగలంతా నువ్వు వాడుకో*, రాత్రంతా నేను వాడుకుంటాను. ఇక ఆవు *ముందు భాగం నీకు*, వెనుక భాగం నాకు!" అన్నాడు అన్న తెలివిగా.

అయోమయం తమ్ముడికి అందులోని కపటం అర్థం కాలేదు. "నువ్వెట్లా అంటే అట్లా చేద్దాం. నీ మాట కాదంటానా అన్నయ్యా?!" అనేసాడు.

ఇక ఆనాటి నుండి ప్రతి రోజూ తమ్ముడు చెట్టు మొదలుకు నీరు పోసేవాడు. ఆవు నోట్లోకి మేత, కుడితి అందించేవాడు. కంబళిని ఏ రోజుకారోజు ఉతికి, ఆరవేసి, మడత పెట్టేవాడు.

చెట్టు కొమ్మలకు కాసిన కాయలు, పండ్లు తీసుకునేవాడు అన్న; ఆవు పాలు తను పిండుకునేవాడు- పేడ అంతా తనే తీసుకునేవాడు; తమ్ముడు ఉతికి పెట్టిన కంబళిని చక్కగా రాత్రిపూట కప్పుకునేవాడు!



ఇలా కొంతకాలం గడిచిపోయింది. అన్నకు, తమ్ముడికి ఇద్దరికీ పెళ్ళి అయ్యింది. తమ్ముడి భార్య లక్ష్మి తెలివైనది. భర్త అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని అతని అన్న ఎలా మోసం చేస్తున్నాడో గమనించింది.

ఒక రోజు ఉదయాన్నే చెట్టుకు నీరు కడుతున్న భర్తతో లక్ష్మి "ఇదిగోయ్యా, గొడ్డలి తీసుకురా, ఓ మాటు" అన్నది.

అతను గొడ్డలి తేగానే, "ఇదిగో, ఈ మాను మొదలు నీదే కదా, మీ అన్నది కాదు కదా?" అన్నది.

"అవును-నాదే" అన్నాడు తమ్ముడు.

"మరైతే ఇంకేమి, దీన్ని నరుకు. పొయ్యిలోకి కట్టెలు లేవు" అన్నది లక్ష్మి, దగ్గర్లోనే నిలబడి వింటున్న పెద్దాయనను గమనిస్తూ.



తమ్ముడు చెట్టుకు ఒక్కవేటు వేసాడో లేదో, అన్న వచ్చి అడ్డుకున్నాడు "మొదలు కొడితే మొత్తం చెట్టు చనిపోతుంది. కొట్టకు. ఇక నుండి మనం ఇద్దరం చెట్టుకు నీళ్ళు పోద్దాం; కాసే కాయల్ని కూడా సమానంగా పంచుకుందాం" అన్నాడు.

ఆరోజు సాయంత్రం అన్న ఆవు పాలు పిండుకుంటుండగా భర్తను పిలుచుకొని అక్కడికి చేరుకున్నది లక్ష్మి. ఆవుకు మొక్కుకొని, దాని ముఖాన్ని కడిగి, బొట్టు పెట్టి, "ఇదిగో, ఈ ఆవు ముందు భాగం నీదే కదయ్యా?" అన్నది భర్తతో.

"అవును" అన్నాడు తమ్ముడు.

"మరైతే ఒక బెత్తం తెచ్చి, కొద్ది సేపు దీని మూతిమీద కొట్టు" అన్నది లక్ష్మి.

తమ్ముడు ఆమెకేసి అదోలాగా చూసాడు కానీ, అన్న ముందుకొచ్చి "ఇదిగో, అలా చెయ్యకు. ఆవు తన్నిందంటే పాలన్నీ నేలపాలు అవుతాయి. ఇకమీద ఆవును ఇద్దరం మేపుదాం; పాలు కూడా చెరి సగం తీసుకుందాం" అన్నాడు.

ఆరోజు సాయంత్రం అవుతుండగా కంబళిని నీళ్ళలో నానబెట్టింది లక్ష్మి. రాత్రికి దాన్ని కప్పుకునేందుకు వచ్చిన అన్న దాన్ని గమనించి "ఒరే! తప్పయిపోయింది. మనం ఇద్దరం రోజుమార్చి రోజు దీన్ని ఉతుకుదాం, ఇద్దరం రోజుమార్చి రోజు ఉపయోగించుకుందాం. నన్ను క్షమించు" అన్నాడు.

'లక్ష్మి తెలివి తేటలు గలది' అని గమనించాక అతను పూర్తిగా మారిపోయాడు. అన్నింటా తమ్మునికి సమాన అవకాశాలిస్తూ వచ్చాడు. అటుపైన రెండు కుటుంబాలూ కలతలు లేకుండా సఖ్యంగా జీవించాయి!



# తప్పిపోయిన పులిపిల్ల

*రచన:శ్రీ సృజన ఆర్, మూడవ తరగతి, ఫ్రీడం ఇంటర్నేషనల్ స్కూల్, బెంగుళూరు.*

అనగనగా ఒక ఇంట్లో ముగ్గురు పెద్దవాళ్ళు- నాన్న, అమ్మ, నానమ్మ ఉన్నారు.

అదే ఇంట్లో ముగ్గురు చిన్నవాళ్ళు- రవి (అన్న), మాయ (అక్క), శీల (చెల్లి) కూడా ఉన్నారు.

నాన్న న్యూస్ పేపర్ చదువుతున్నాడు ఆఫీసు గదిలో.

"నేను కూరగాయలు కొనడానికి మార్కెట్‌కి వెళ్తున్నాను" అందరికీ చెప్పింది అమ్మ.

"నాకు కాన్ఫరెన్సు ఉంది. నన్ను మాట్లాడించకండి" అన్నాడు నాన్న ఆఫీసు గదిలోంచి. ఇంకో విషయం గుర్తుకువచ్చినట్లుగా చెప్పాడు- "ఇంకో సంగతి- ఇవాల్టి దినపత్రికలో వార్త చూసారా? పులిపిల్ల ఒకటి ఏదో మన ఇంటి వెనకనే ఉన్న జంతు ప్రదర్శనశాల నుండి తప్పించు-కున్నదట. మన ఇంటికే ఏమైనా వస్తుందేమో, చూస్కోండి మరి!" నాన్న ఈ సంగతి చెప్పి గట్టిగా నవ్వాడు.

"అవునా?! నిజంగానా?!" అన్నది శీల, ఆట మొదలుపెడుతూ.

"దానికేమీ పని లేదా? మనింటికే

ఎందుకొస్తుంది? మాయ కోసమో, శీల కోసమో రావాలి వస్తే-" అన్నాడు రవి, తలుపు తీసుకొని క్రికెట్ ఆడుకునేందుకు పోతూ.

నానమ్మ గదిలో పడుకొని మొద్దు నిద్ర పోతున్నది. మాయ పోయి నానమ్మ-తోబాటు మంచం మీద పడుకున్నది.

శీల తన బొమ్మలన్నింటినీ ఒక్కటొక్కటిగా నానమ్మ గదికి చేరుస్తూ "నా టిగ్గర్ బొమ్మ ఏదీ?" అని ఇల్లంతా వెతుక్కున్నది.

శీల దగ్గర ఒక పెద్ద పులి బొమ్మ ఉంది. అది మెత్తగా, బొచ్చు బొచ్చుగా, బరువుగా ఉంటుంది. దానికి 'టిగ్గర్' అని పేరు పెట్టుకున్నదది.

"ఇదిగో, బంగారూ! మాట్లాడకుండా వెతుక్కోమ్మా, ఎక్కడో ఉంటుంది అది" అరిచాడు నాన్న, ఆఫీసు పనిలోంచే.

కొంచెం సేపటికి ముందుగదిలో పడి ఉన్న టిగ్గర్ కనిపించింది శీలకు. "ఉన్నదిలే, దొరికింది" చెప్పింది అందరికీ. అయినా వినేందుకు అక్కడ ఎవ్వరూ లేరు.

మిగిలిన బొమ్మలన్నిటినీ నానమ్మ గదిలోకి చేర్చాక శీల మళ్ళీ టిగ్గర్ కోసం చూసింది- అది ముందు గదిలో లేదు! "నా టిగ్గర్ మళ్ళీ ఎక్కడికో పోయింది" అరిచింది శీల.

"ఊరుకోమ్మా, ఎక్కడో ఉంటుంది చూడు, కొంచెం వెతుక్కో, నన్ను డిస్టర్బ్ చేయకు ప్లీజ్!" అరిచాడు నాన్న.

మిగిలిన బొమ్మలన్నిటితోపాటు టిగ్గర్ కూడా నానమ్మ గదిలో కనిపించింది శీలకు.

"ఉన్నదిలే, దొరికింది" చెప్పింది గట్టిగా.

"ఉండక ఎక్కడికి పోతుంది? పాపా, ఆ బొమ్మలన్నిటినీ తీసి అలమరలో క్రింది అరలో పెట్టేయమ్మా. ఇంటికి బంధువులు వస్తారు" అరిచాడు నాన్న.

శీల నానమ్మ గదిలో అలమార తలుపు తీసి, ఒక్కొక్క బొమ్మనీ అందులోకి చేర్చింది.

"నా టిగ్గర్ మళ్ళీ కనబడటం లేదు" అరిచింది.

"ఊరుకో శీలా. అలమర క్రింది అరలోకి చేరుకొని ఉంటుంది అది కూడా. చూడు" అరిచాడు నాన్న ఆఫీసులోంచి.

శీల వంగి చూసింది. టిగ్గర్ కూడా మిగిలిన

బొమ్మల్తో పాటు అలమర క్రింది అరలో కనిపించింది.

"ఉన్నదిలే, దొరికింది" చెప్పింది గట్టిగా.

"అదేనమ్మా, నేను అనేది! సరిగ్గా వెతుక్కోవాలి అంతే" అరిచాడు నాన్న.

"టిగ్గర్ ఇన్నిసార్లు ఎందుకు పోతున్నది? ఆలోచించాలి" అన్నది మాయ, నానమ్మ మంచం మీదే లేచి కూర్చొని.

ఇంతలో ఎక్కడినుండో 'గుర్ గుర్ గుర్..' అని శబ్దం వస్తున్నది.

మంచం మీద కూర్చొని ఉన్న మాయ హటాత్తుగా అరిచింది "నాన్నా!"అని.

శబ్దం టక్కున ఆగిపోయింది.

అంతలోనే మళ్ళీ మొదలైంది. ~~ఈసారి~~ "ఠక్..ఠక్..ఠక్.." మని గట్టిగా తలుపు కొడుతున్నట్లు శబ్దం కూడా తోడైంది.

"గుర్ గుర్.. ఠక్... ఠక్..."

మాయా చాలా సీరియస్ అయిపోయింది. తరువాత "శీలా! ఇటురా! నీ టిగ్గర్ ఏది?" అడిగింది.

"నానమ్మ అలమరలో ఉంది- తీయాలా?" అని అటువైపుకు పోబోయింది.

మాయ టక్కున తనని ఆపింది. "శీలా ఇదిగో- అలమర తలుపు తీయకు. నీ మంచి కోసమే చెబుతున్నాను. ఇక్కడే ఆగు. నాన్న చెప్పినట్లు, పులిపిల్ల మన ఇంట్లోకే దూరింది. అది ఇప్పుడు ఎక్కడుందో నాకు తెలుసు" అంటూనే గట్టిగా అరిచింది "నాన్నా! జూ వాళ్లకి ఫోన్ చేయండి నాన్నా! మన ఇంట్లో పులిపిల్ల ఉన్నదని చెప్పండి. గబుక్కున రమ్మనండి. అది బయటికి వచ్చేస్తే కష్టం!" అని.

"అవునా, ఎక్కడ ఉంది పులిపిల్ల?" అడిగింది శీల ఉత్సాహంగా.

"అది నా బల్ల కింద ఉంది!" అన్నది మాయ, ఒక్క క్షణం ఆలోచించి.

శీల వెతికి చెప్పింది. "ఇక్కడ లేదు- నాకు తెలుసు, ఎక్కడ ఉంటుందో! అది అమ్మమ్మ మంచం కింద ఉండి ఉంటుంది!" అని.

"అవును. నువ్వెళ్ళి అక్కడ వెతుకు- నాన్నా! ఫోన్ చేసారా?"

"చేసాను. రెండు నిముషాలలో చేరుకుంటారు. ఇక్కడే ఉన్నారట, మన

ఇంటి ప్రక్కనే" నాన్న అరిచాడు ఆఫీసులోంచి.

ఆలోగా శీల నానమ్మ మంచం దగ్గరికి వెళ్లి వెతికింది. మాయతో గుసగుసలాడింది. "అరె! ఇక్కడ కూడా లేదే!" అని.

"ముందు గదిలో ఉండి ఉంటుంది- పోయి చూడు!" అన్నది మాయ.

శీల ముందు గదిలో అంతా వెతికింది. తర్వాత అమ్మవాళ్ల గదిలో వెతికింది. "పులి అక్కడెక్కడా లేదు- అలమారలో ఉండి ఉంటుంది" అలమార తలుపు తీయబోయింది.

మాయ చటుక్కున దానికి అడ్డం వచ్చి నిలబడింది. "కాదు. కిచెన్ సింక్ కింద వెతుకు- కనిపిస్తుంది" అన్నది. "నాకు తెలిసి పైన ఉండవచ్చేమో కూడా! "

తరువాత కొంత సేపటికి బయటి నుండి ఎవరో వింతగా అరిచిన శబ్దం ఒకటి వినిపించింది. "భం-ప-భం-ప-భం... ఫూ-ఫ-ఫూ-ఫ-ఫూ!" వెంటనే నానమ్మ గది అలమార తలుపు 'ఠకఠక' మని కొట్టుకోవటం మొదలెట్టింది.

అయితే ఆలోగానే జంతు ప్రదర్శనశాల వాళ్ళు ఇంట్లోకి వచ్చేసారు. "ఇక్కడికి రండి- ఇక్కడికి!" అరిచింది మాయ. వాళ్ళు నేరుగా నానమ్మ గదిలోకి వెళ్ళి, అలమార తలుపు ముందు ఒక గోతం పెట్టి, అలమార తలుపులు తీసారు టక్కున.



లోపల ఉన్న పులిపిల్ల గబుక్కున వాళ్ల సంచీలోకి దూరింది.

చటుక్కున సంచీ మూతి బిగించి కట్టి, తీసుకెళ్ళిపోయారు వాళ్ళు- "ఫోన్ చేసినందుకు థాంక్స్ సర్!" అని నాన్నకు చెబుతూ.

శీల నానమ్మ గది అలమార తలుపులు తీసి చూసుకున్నది. "నా టిగ్గర్ ఏది? మళ్ళీ కనబడట్లేదు" అన్నది.

"సరిగ్గా వెతుక్కో పాపా!ఎక్కడో ఒకచోట ఉండే ఉంటుంది!" ఒకేసారి అరిచారు మాయ, నాన్న.

అంతలో వాళ్లమ్మ కూరగాయలు తీసుకొచ్చింది. ఇంటి పరిస్థితిని చూసి "ఏమైంది ఇక్కడ?" అన్నది.

నాన్న అన్నాడు అమ్మ కళ్ళలోకే చూస్తూ "నాకు **పులిపిల్ల**కు వేసేంత ఆకలి వేస్తోంది- భోజనం కావాలి!" అని.

"నేను అందరినీ ఇవాళ్ల **పులిపిల్ల** బారినుండి రక్షించాను!" మాయ చెప్పింది అమ్మతో గుసగుసగా.

**"పులిపిల్ల?! టిగ్గర్?!"** అమ్మ నోరు తెరిచింది ఆశ్చర్యంగా.

"నా టిగ్గర్ కనిపించట్లేదు. జంతు ప్రదర్శన శాలవాళ్ళు ఎత్తుకుపోలేదు కద?!" అడిగింది శీల అనుమానంగా. అందరూ నవ్వారు.

తరువాత రోజు ఉదయం వార్తా పత్రికలో ఒక సింహంపిల్ల కూడా జంతు ప్రదర్శనశాల నుండి తప్పిపోయిందని చదివిన మాయ అరిచింది- "శీలా! నీ లయన్ బొమ్మ ఎక్కడికీ పోలేదు కద, చూసుకో ఓసారి!"అని.

టీచర్: వాట్ ఈజ్ యువర్ నేమ్?

స్టూడెంట్: నా పేరు సూర్య ప్రకాష్

టీచర్: నేను ఇంగ్లీషులో అడిగాను కదా! ఇంగ్లీషులోనే జవాబు చెప్పు!

స్టూడెంట్: మై నేమ్ ఈజ్ సన్ లైట్

**అమ్మ, చింటూ!**

అమ్మ: నీకు దేవుడు కనిపించి ఒక చేతిలో డబ్బులు, ఇంకొక చేతిలో తెలివి తెచ్చి నీకు ఏది కావాలో కోరుకో అంటే నువ్వు ఏమి కోరుకుంటావు?

చింటు: డబ్బులు!

అమ్మ: తప్పు. నేనైతే తెలివి కావాలని కోరుకుంటాను

చింటు: అవును లేమ్మా! ఎవరికి ఏది లేకపోతే అదే కోరుకుంటారు.

# బొమ్మకు కథ రాయండి

మామూలుగా మురికిగా ఉండే అల్లరి కోతి పిల్ల ఇవాళ్ల ఎందుకనో అందంగా ముస్తాబైంది. ఎక్కడికైనా బయలుదేరిందా? ఎందుకు? ఎక్కడో, ఏదో జరిగి ఉండాలి- ఏమైందో ఏంటో మరి. సరిగ్గా ఊహించి, బాగా నవ్వొచ్చే ఈ కోతిపిల్ల కథని వీలైనంత త్వరగా రాసి పంపుతారుగా? బాగున్న కథకి కొత్తపల్లిలో స్థానం కల్పిస్తాం ! చక్కని ఓ బహుమతినిస్తాం కూడాను- త్వరపడండి మరి !



మా చిరునామా: కొత్తపల్లి, 1-127/A, MROఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101



# బంగారు ముక్కుపొడుం భరిణ

రష్యన్ కథ

అనుసృజన - రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి.

## 1

ఒకప్పుడు 'యాంకా' అనే పిల్లవాడొకడు ఉండేవాడు. అతనికి అమ్మానాన్నలు ఇద్దరూ లేరు. అడవికి దగ్గరగా ఉన్న పూరి గుడిసెలో ఒంటరిగా నివసించేవాళ్ళు అతను, అతనికి తోడుగా ఒక పిల్లి. ఆ పిల్లి అతనికి బాగా మాలిమి కూడా అయింది. అతను ఎక్కడికి వెళితే అది కూడా అతని వెంట వెళ్ళేది.

ఒకరోజు యాంకా కట్టెల కొట్టేందుకు బయలుదేరాడు. ఎండిన చెట్లను వెతుక్కుంటూ అడవిలో చాలా లోపలికి వెళ్ళాడు. అలవాటు ప్రకారం పిల్లి కూడా అతన్ని అనుసరించింది.

యాంకా కొన్ని పుల్లలను ఏరుకుని కట్ట కట్టి

తీసుకు వస్తున్నాడు. మధ్య దారిలో అలిసిపోయి మోపుని క్రింద పడేసి అక్కడున్న ఒక మొద్దుపైన కూర్చున్నాడు. "ఓహ్! ఓహ్!" అంటూ గాలి పీల్చు-కున్నాడు.

ఆ మాటలు అతని నోటినుండి వెలువడటమే తరువాయి, పొడవాటి గడ్డపు ముసలాయన ఒకడు ఆ చెట్టు ప్రక్క నుండి వచ్చి యాంకాకు ఎదురుగుండా నిలబడ్డాడు.

ఆశ్చర్యపోయి చూస్తున్న యాంకాతో “యువకుడా, నన్నెందుకు పిలిచావో చెప్పు!" అన్నాడు ముసలాయన.

యాంకా ముసలాయన వైపు చూసి బెరుకు గొంతుతో "తాతా! నేను నిన్ను పిలవలేదే!" అన్నాడు.

“ఏంటీ, పిలవలేదా? నాకేమీ వినికిడి లోపం లేదు! నువ్వు 'ఓహ్, ఓహ్' అని నా పేరుతో రెండు సార్లు పిలిచావు! ఇప్పుడు నీ కోరిక ఏమిటో చెప్పెయ్యి త్వరగా. తీర్చేసి వెళ్ళిపోతాను- పనులున్నై" అన్నాడు తాత.

“కోరికలా? నాకు అట్లాంటివేమీ లేవు గాని, బాగా ఆకలిగా ఉంది. నీ దగ్గరేమైనా రొట్టె ముక్కలుంటే ఇవ్వు చాలు" అన్నాడు యాంకా.

ముసలాయన చెట్టు ప్రక్కకి వెళ్ళిపోయి మరునిమిషంలోనే ఒక పాత్రలో రొట్టెలు, మరో పాత్రలో క్యాబేజీ పులుసు తెచ్చి ఇచ్చాడు. యాంకా ఆవురావురుమంటూ తిన్నాడు వాటిని.

"తాతా నీ విందుకు శతకోటి వందనాలు. ఇంత మంచి పదార్థాలను నేను నా ఏనాడూ తిని ఉండలేదు!" అన్నాడు యాంకా.

ముసలాయన నవ్వుకుంటూ చెట్టు వెనక్కి వెళ్ళి కనపడకుండా పోయాడు. యాంకా తన కట్టెల మోపును తీసుకుని ఇంటికి చేరాడు.

కొన్ని రోజుల తర్వాత అతనికి మళ్ళీ ఆ తాతని పలకరించి, అతనిచ్చే రొట్టెలు తినాలనిపించింది. 'వెళ్ళి పిలుస్తాను; వస్తే వస్తాడు; నా అదృష్టాన్ని బట్టి' అనుకుని, మళ్ళీ ఒకసారి ఆ మొద్దు ఉన్న ప్రదేశానికి వెళ్ళి. “ఓహ్, ఓహ్" అని పిలిచాడు.

వెంటనే చెట్ల ప్రక్కనుండి బయటకి

దుమికాడు ముసలాయన. “యువకుడా, నన్నెందుకు పిలిచావో చెప్పు!" అంటూ.

“తాతా! చాలా ఆకలిగా ఉంది, ఒక రొట్టె ఉంటే ఇస్తావా?” అడిగాడు యాంకా.

రెప్పపాటులో మాయమై మళ్ళీ ప్రత్యక్షమైన ముసలి వాడు రొట్టెలు, క్యాబేజీ పులుసు తెచ్చి ఇచ్చాడు మళ్ళీ



ఇలా చాలా సార్లు యాంకా ముసలివాడి దగ్గరకి వెళ్ళటం, రొట్టెలు తినటం జరిగాక, చివరికి తాత చెప్పేసాడు- "చూడు యువకుడా! విను, నన్ను ఇక మీదట కలత పెట్టవద్దు. ఇప్పటికే ముసలి-వాడిని అయ్యాను. మోకాళ్ళు సహకరించటం లేదు. ఇదిగో, నా ఈ ముక్కుపొడుం భరిణ తీసుకో. దీనిలో నా సేవకుడు ఉంటాడు. నీకు ఏం కావాలన్నా ఇది తెరువు. లోపల నుండి అతనొస్తాడు. నీకు ఎట్లాంటి కోరిక ఉన్నా అతనికి చెప్తే చాలు- తీరుస్తాడు" అని ఒక భరిణ ఇచ్చాడు.

యాంకా ఆ భరిణని తీసుకుని గుండెనిండా తాతని తల్చుకుంటూ ఇంటికి చేరాడు.

ఇంటికెళ్ళాక దాన్ని తెరవగానే అందులో నుండి ఒక చిన్నవాడు బయటకి దూకాడు. చాలా చురుగ్గా, తెలివైనవాడిలా ఉన్నాడతను- “అన్నా, నీకేం కావాలో చెప్పు" అన్నాడు.

“తమ్ముడూ, తినడానికి ఏమైనా పెడతావా?” అన్నాడు యాంకా. రెప్పపా-టులో అతనికి భోజనం తయారుచేసి ఇచ్చి, మళ్ళీ భరిణలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు చిన్నవాడు.

## 2

జీవితం హాయిగా జరిగిపోతోంది యాంకాకి. ఉన్నవాడు ఊరుకోక, 'ఈ విశాల ప్రపంచం అంతా తిరిగి వస్తాను' అనుకున్నాడు. అంతకు ముందు అతనెప్పుడూ ఆ అడవి చుట్టు ప్రక్కలు దాటి ఎక్కడకీ వెళ్ళలేదు.

అయితే ఒకసారి అలా నిర్ణయించుకోగానే తన భరిణని, పిల్లినీ తీసుకుని బయలుదేరి పోయాడు; చాలా గ్రామాలు, నగరాలు తిరిగాడు; చాలా వింతలు చూశాడు.

ఒకరోజు అతను అట్లా సముద్రం అంచున నడుస్తుండగా ఒక చిన్న చేపపిల్ల ఒకటి, అలల తాకిడికి బయటకి వచ్చి పడింది. యాంకాకి కనబడే సరికే అది చనిపోయే స్థితిలో ఉన్నది. యాంకా గభాల్న ఆ చేపపిల్లని తీసి నీళ్ళలోకి వదిలాడు.

ఆ చిన్ని చేప తోకని ఆడిస్తూ కొద్దిగా నీళ్ళు తాగి, తల పైకెత్తి- "ఓ యువకుడా, నన్ను కాపాడినందుకు దండాలు. ఎప్పుడో నీకు నేను సహాయం చేసే రోజు వస్తుంది. అప్పుడు బాకీ తీర్చుకుంటాను" అంది.

ఆ మాటలు విన్న యాంకా పిల్లి చేప పిల్లను చూస్తూ "మ్యావ్, మ్యావ్" అంది. చేపపిల్ల కిలకిలా నవ్వింది.



నాకు భరిణలో నా చిన్ని తమ్ముడున్నాడుగా సహాయానికి! అయినా ఈ చేపపిల్ల నాకేం సహాయం చేయగలదు!? అని అనుకున్న యాంకా ఆ చేప మాటలకి నవ్వుకుని తన యాత్ర కొనసాగించాడు.

పోగా పోగా ఒక పట్టణం వచ్చింది. అప్పటికి సాయంకాలం దాటింది.. చీకట్లు

అలుముకుంటున్నాయి..

యాంకాకు చాలా అలసటగా ఉంది. విశ్రాంతి కోసం చుట్టూ చూశాడు. కొండ మీద పెద్ద మహలు కనిపించింది. "ఆహా, ఆ మహల్ ఎంత బాగుంది? కానీ వాళ్ళు నన్నెందుకు రానిస్తారు? ఏదైనా సత్రం కోసం చూసుకోవాలి.." అనుకుంటూ ముందుకు వెళ్ళాడు.

సత్రం యజమానితో "ఇక్కడ నేను బస చేయవచ్చా?!" అని అడిగాడు.

"ఎందుకు చేయకూడదు? మీలాంటి వాళ్ళ కోసమే కదా మా రాజుగారు ఇది కట్టించింది?!" అన్నాడు సత్రం యజమాని.

"ఓ, అయితే దారిలో నేను చూసిన ఆ మహల్ మహారాజుగారిదేనా?!" అన్నాడు యాంకా.

"అవును కాని మా రాజుగారు ప్రస్తుతం చాలా దిగులులో ఉన్నారు. ఆయన ఒక్కగానొక్క కూతురును 'మాయాదీవి భూతంగాడు పట్టుకుని పోయాడు. ఎవరైతే తన బిడ్డని ఆ మాయావి నుండి కాపాడి తీసుకొస్తారో వాళ్ళకి రాజ్యంతోబాటు ఇచ్చి తన కుమార్తెను కూడా ఇచ్చి పెళ్ళి చేస్తానని రాజుగారు ప్రకటించారు. అయినా ఇంతవరకూ ఆమెని ఎవ్వరూ తీసుకు రాలేకపోయారు. రాజేమో దిగులుతూ మంచం పట్టాడు.. యాంకాకి చెప్పాడతను.



"నేను ప్రయత్నిస్తాను" అన్నాడు యాంకా.

"వద్దు, ప్రయత్నించి ఎంతో మంది యువకులు సముద్రం పాలయ్యారు. మాయాదీవి భూతం సముద్రంలో తాడిచెట్టంత ఎత్తున్న అలలని సృష్టిస్తుంది.

ఎంత గజ ఈతగాడు పోయినా ఆ అలల క్రింద పడి మునిగిపోవలసిందే!" చెప్పాడు సత్రం యజమాని.

'నా బంగారు ముక్కు పొడుం భరిణ తమ్ముడుంటే ఏదైనా సాధించవచ్చు' అనుకున్నాడు. సత్రం యజమానికి చెప్పాడు- "నువ్వు రేపు వేకువనే మహల్‌కి వెళ్ళి రాజుగారితో చెప్పు- పొద్దు పొడిచే-టప్పటికి రాకుమార్తె ఆయన ముందు ఉంటుందని!" అని.

## 3

వేకువనే లేచి, రాజుగారికి యాంకా గురించిన వార్తను చేరవేయడానికి వెళ్ళాడు సత్రం యజమాని. అతను వెళ్ళిపోయాక యాంకా తన భరిణని తెరిచాడు: చిన్నవాడు బయటకి గెంతి "అన్నా, నీ కోరికేమిటో చెప్పు!" అన్నాడు.

“రాజభవనం నుండి మాయాదీవిలో రాజకుమార్తె ఉన్న చోటికి ఒక వంతెన నిర్మించు తమ్ముడూ! ఆ వంతెన మీదుగా నేను ప్రయాణించేందుకుగాను ఆరు గుర్రాలతో కూడిన బండి కూడా ఒకటి తెచ్చిపెట్టు" అన్నాడు అతనితో.



కళ్ళు మూసి తెరిచేంతలో అక్కడొక వంతెన ప్రత్యక్షమైంది. ఆరు గుర్రాల బండి ఒకటి ఆ వంతెన ముందు కాచుకుని ఉంది. చిన్నవాడు కోరికలు తీర్చగానే భరిణలోకి వెళ్ళిపోయాడు.

తక్షణం బండి ఎక్కి ప్రయాణమైపోయిన యాంకా త్వరలోనే మాయాదీవికి చేరుకు-న్నాడు. అక్కడ ఒక ఒంటి స్తంభపు మేడ కిటికీలో నుండి రాజకుమారి సముద్రంలో ఏర్పడిన వంతెనను, బండిలో ఉన్న

యాంకాను వింతగా చూస్తున్నది! ఆ మేడ వాకిలికి అడ్డంగా పడుకుని గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు మాయావి!

“రాజకుమారీ! నేను నిన్ను మీ తండ్రిగారి వద్దకు చేర్చడానికి వచ్చాను. వచ్చి బండి ఎక్కండి" అన్నాడు యాంకా, కిటికీ దగ్గర నిలబడి.

"నేను రాలేను! తలుపు దగ్గర అడ్డంగా పడుకుని ఉన్నాడు, మాయావి!" అంది రాకుమారి.

"కిటికీలో నుండి దూకు! నేను ఇటునుండి పట్టుకుంటాను" అని చేతులు చాపాడు యాంకా.

ఆమె సరేనన్నది. అయితే సరిగ్గా దూకే సమయంలో ఆమెకు ఎక్కడలేని భయం వేసింది. ఆ భయంలో ఓ వెర్రికేక వేసింది! అది వినగానే మాయావి నిద్రలేచి అటూ ఇటూ చూసాడు. ఈలోగా రాకుమారిని ఎక్కించుకొని మెరుపు వేగంతో గుర్రపు బగ్గీని తోలసాగాడు యాంకా.

అయితే మాయావి వెంటనే వాళ్ల వెనకనే పరిగెత్తుకు రాసాగాడు! వాడి అరుపులకు వంతెన మొత్తం అల్లాడసాగింది. వాడి నోటి నుండి పెద్ద పెద్ద మంటలు చెలరేగాయి!

అయితే వాడికంటే చాలా ముందు ఒడ్డుకు చేరుకున్నాడు యాంకా. వెంటనే రాజకుమారిని క్రిందకి దించి రాజభవనంలోకి పంపేసి తలుపు వేసేసాడు. వెంటనే తన ముక్కుపొడుం భరిణ తెరిచి, "వంతెనని కూల్చేయ్" అని అరిచాడు. భరిణలోని చిన్నవాడు ఒక్క క్షణంలో వంతెనని కూల్చేసాడు. వంతెన కూలిపోయింది; మాయావి సముద్రంలో పడి కొట్టుకుపోయాడు!

అయితే ఆ హడావిడిలో ఒక తప్పు జరిగిపోయింది: యాంకా చేతులోంచి భరిణ జారి సముద్రంలో పడిపోయింది!

## 4

ఒడ్డునే దిగాలుగా కూర్చుని బాధపడు-తున్న యాంకా దగ్గరకి వచ్చారు- రాజుగారు, రాజకుమారి.

రాజుగారు అన్నారు ఆనందంతో- "బాగు బాగు, యాంకా! నువ్వు గొప్ప

సాహసవంతుడివి. నా రాజ్యానికి వారసుడివి నువ్వే. ఇక రాకుమారిని వివాహమాడు; రాజ్యాన్ని పరిపాలించు" అన్నాడు.

అయితే యాంకా మనసు మనసులో లేదు. అతని మనసంతా సముద్రంలో మునిగిపోయిన ముక్కుపొడుం భరిణ మీదనే ఉన్నది. అంతలో అకస్మాత్తుగా అతని పిల్లి సముద్రంలోకి చూస్తూ మ్యావ్, మ్యావ్" అని అరిచింది. మరుక్షణం యాంకా కాపాడిన బుల్లిచేప బయటకి వచ్చింది, సముద్రంలోంచి!



"యాంకా! పాపం, నీ భరిణ నీళ్ళల్లో పడిందటగా, పిల్లి మామ చెప్తున్నాడు. అయితే నా దగ్గర బోలెడన్ని భరిణలు ఉన్నాయి. నీదేదో నాకు తెలియదు కాబట్టి ఒక్కొక్కటీ బయటకి విసిరేస్తాను, నీ భరిణేదో నువ్వు గుర్తించి తీసుకో" అని నీటిలోకి వెళ్ళిపోయింది చేపపిల్ల.

అట్లా పోయిన ఆ చేపపిల్ల రకరకాల భరిణల్ని బయటకి విసిరింది: వెండివి, బంగారువి, వజ్రాలవి, వైఢూర్యాలవి.... ఆఖరున యాంకా పొడుం పెట్టె బయటకి వచ్చింది. దాన్ని తీసుకుని మిగిలిన పెట్టెలన్నింటినీ మళ్ళీ సముద్రంలోకి విసిరేస్తూ "నీకు అనేక కృతజ్ఞతలు, చిట్టి చేపా! 'నువ్వు నాకేం సహాయం చేయగలవులే' అని చిన్న చూపు చూసాను. నన్ను క్షమించు" అన్నాడు యాంకా. బుల్లిచేప కిలకిలా నవ్వుతూ నీళ్ళ లోపలకి వెళ్ళిపోయింది.

అటుపైన రాకుమారిని వివాహమాడిన యాంకా ముక్కుపొడుం పెట్టెలోని తమ్ముడి సహాయంతో ఎన్నో ఘనకార్యాలను సాధించాడు.

ప్రతి సంవత్సరం యాంకా ఒక్కసారైనా అడవిలోకి వెళ్ళి "ఓహ్ఓహ్" చేత్తో రొట్టెలు, క్యాబేజీ పులుసు తిని కృతజ్ఞతలు చెప్పుకుని వస్తాడు. వస్తూ వస్తూ చేపపిల్లని కూడా చూసి, ధన్యవాదాలు చెప్పుకుంటాడు!



# డాక్టరు గారు-యక్షుల ఊరు

*పున:సృజన : నారాయణ, కొత్తపల్లి బృందం.*
*సౌజన్యం : బెట్టీ, స్టోరీ నోరీ డాట్ కాం*

ఐరిష్ జానపద కథ

అనగనగా ఇంగ్లండులోని 'లప్నియా' అనే మారుమూల గ్రామంలో ఒక డాక్టరుగారు ఉండేవారు.

ఆయన చాలా మంచివాడు, నెమ్మదస్తుడూనూ. "రోగులు పాపం రోగపు బాధతోటి కష్టపడుతుంటారు కదా, వాళ్ళని డబ్బుకు అడిగితే ఏం బాగుంటుంది?" అని వాళ్ళను డబ్బులు కూడా అడిగేవాడు కాదు. అయినా దేవుడి దయవల్ల ఆయన అనసరాలకు తగినట్లు డబ్బు

సమకూరుతూఉండేది.

ఒకసారి వాళ్ళ అమ్మాయి పెళ్ళి సందర్భంగా డాక్టరుగారికి చాలా డబ్బులు అవసరమైనాయి. "ఇన్నాళ్ళుగా ఏమీ కూడబెట్టలేదు. ఇప్పుడేం చెయ్యాలి?" ఆయన భార్య పోరటం మొదలుపెట్టింది. ఆయనకూ ఏం చేయాలో పాలుపోలేదు.

ఆరోజు రాత్రి చీకటి పడ్డాక డాక్టరుగారి ఇంటి తలుపునుదబదబా బాదారెవరో. గబుక్కున మేలుకున్న డాక్టరుగారు పైజామా నాడాలు కట్టుకుంటూ బయటికొచ్చారు- 'ఎవరది?' అంటూ. ఇంటి ముందు ఖరీదైన గుర్రపు బండి ఒకటి ఆగి ఉంది. బాగా పాలిష్ పట్టిన మహగొని చెక్కతో చేసిన ఆ బండికి అన్నివైపులా మఖ్మల్ తెరలు వేలాడుతున్నాయి. నడిపే కుర్రాడు సన్నగా, మరుగుజ్జులాగా వింతగా ఉన్నాడు.

బండిలోపల జమీందారులాంటి పెద్ద మనిషి ఒకాయన కూర్చొని ఉన్నాడు. డాక్టరు గారిని చూడగానే అతను బండి దిగి వచ్చాడు- అతని వేళ్ళన్నింటి మీదా రకరకాల ఉంగరాలు మెరుస్తున్నాయి. " అయ్యా , డాక్టరుగారూ! త్వరగా రావాలి. మీ కోసం అంత దూరం నుండి వచ్చాం. పెద్దావిడ ఆరోగ్యం అకస్మాత్తుగా పాడైంది. మీరు తప్ప ఇంకే డాక్టరూ వద్దంటున్నది. దయచేసి మీరే రావాలి. ఇదిగో మీకోసం ఈ బండిని కూడా తీసుకొచ్చాను" అని ప్రాధేయపడ్డాడు.



డాక్టరుగారు చకచకా తయారై బండెక్కి కూర్చున్నారు. "రండి-రండి. వాయువేగంతో బండిని పోనిస్తాడు. తమరు ఏమీ

అనుకోరాదు. అసౌకర్యం లేకుండా ఈ తెరలు వేసేస్తాను" అని తెరలు మూసేసాడు జమీందారు గారు.

గతుకుల రోడ్డు మీద బండి గడగడలాడుతూ పరుగు మొదలు పెట్టింది. అయితే ఆశ్చర్యం, కొద్దిసేపటికే ఏదో రాజవీధినెక్కినట్లు, గతుకులన్నీ పోయాయి! బండి ఎంత సుతిమెత్తగా పోసాగిందంటే, అసలది ఆగిపోయిందేమో అని డాక్టరుగారికి అనుమానం వేసింది! ఊరికే తెరల సందులోంచి బయటికి చూసిన డాక్టరుగారు ఆశ్చర్యంతో నోరు తెరిచారు. బండి నేలమీద నేలకు ఇంతెత్తున, గాలిలో పరుగుపెడుతున్నది!!

అంతలోనే ప్రక్కన కూర్చున్న జమీందారు గారు చిరునవ్వుతో, చాలా మర్యాదగా ఆయన్ని తనవైపుకు త్రిప్పుకొని తెరలు వేసేశాడు- "భలేవారు, డాక్టరు గారు! మీరు చాలా మంచివారు- ఇట్లా నా ప్రక్కన కూర్చోండి; ఓ పది నిమిషాలు ఏం జరుగుతున్నదీ పట్టించుకోకండి; మిమ్మల్ని నేను భద్రంగా చేరుస్తానుగా, మీకెందుకు బాధ!" అంటూ. "కాదు, మనం అప్పుడే నది ఒడ్డుకు వచ్చేసినట్లున్నాం కదా, మరి పడవ మాట్లాడుకోవాలేమోనని.." అన్నారు డాక్టరుగారు అసౌకర్యంగా.



"ఏమీ అవసరం లేదు సర్. మా యీ గుర్రాలు నీళ్లలోనూ పోతాయి. అయినా కొంచెం గట్టిగా పట్టుకోండి- పడేరు!" అన్నాడు ఆ వింత వ్యక్తి. "అవునులే, బండి చక్రాలు అసలు నేల మీద, నీళ్ల మీద ఆనితేనే గద!" అనుకున్నారు డాక్టరుగారు.

అంతలోనే గుర్రాలు చకా చకా నీళ్ల మీదుగానే బండిని లాగేశాయి. అప్పుడు వచ్చే శబ్దానికి, ఆ సంగతి అర్థమైపోయింది- "భలే ఉన్నదండి, మీ బండి!" నవ్వారు డాక్టరు గారు "ఇంతకీ పేషంటుది ఎలాంటి

సమస్యే చెప్పనే లేదు!" అంటూ.

"అయ్యో! నేను చెప్పనేలేదు కదూ, మీరు వస్తున్నది 'డన్విచ్' రాణి గారి కోసం. రాణి గారికి బాగా కడుపు నొప్పిగా ఉన్నది. మీరు తప్ప మరెవ్వరూ ఆ బాధని తగ్గించలేరని ఆవిడ నమ్మకం" చెప్పాడు అతను.

"మరి మీరు-" అన్నారు డాక్టరుగారు.

"మమ్మల్ని డన్విచ్ రాజావారు అంటారు" చెప్పాడాయన.

అంతలోనే గుర్రపు బగ్గీ ఓ కొండ మీదికి ఎక్కసాగింది. కొన్ని కొన్ని సందర్భాలలో రోడ్డు చాలా నిటారుగా, దాదాపు అసాధ్యంగా ఉన్నట్లు తోచింది. అయినా గుర్రపు బండికి అవేమీ ఒక లెక్క కాలేదు.

డాక్టరు గారికి ఇదంతా చాలా గందరగోళంగా తోచింది. వీళ్లు ఎవరో, తనని ఎటు తీసుకువెళ్తున్నారో ఏమీ అర్థం కాలేదు. అయినా ఆయన తన ప్రశాంతతని కోల్పోకుండా కూర్చున్నాడు.

ఆలోగా బండి కొండమీద ఓ భవంతి ముందు ఆగింది. వాళ్ల కోసమే ఎదురు చూస్తున్నట్లు, కొందరు పరిచారకులు పరుగున వచ్చి, మర్యాదగా బగ్గీ తలుపులు తెరిచి పట్టుకున్నారు.



డాక్టరు గారు బండి దిగి అటూ ఇటూ కలయ చూశారు. చుట్టూతా చిమ్మ చీకటి అది అసలు నరమానవుల సంచరించే చోటులాగే లేదు. ఆయనకెదురుగా ఉన్న భవంతి కూడా వింతగా ఉన్నది. ఎక్కడా వెలుతురు, లైట్లు ఉన్న జోడీలేదు. అంతలోకే బండిలోంచి దిగిన రాజావారూ,

పరిచారకులూ అందరూ "రండి లోనికి" అంటూ ఆ చీకట్లోకి దారి తీసారు.

వాళ్ల వెంట తడుముకుంటూ పోయారు డాక్టరు గారు. వాళ్ల ప్రయాణం సన్నటి, పొడవైన, తక్కువ ఎత్తు కప్పులున్న చీకటి దారుల వెంట సాగింది. ఏమంటే మిగిలిన వాళ్లంతా అలవాటు కొద్దీ అలవోకగా వేగంగా పోతే, డాక్టరు గారు మటుకు పడుతూ లేస్తూ గబగబా నడవాల్సివచ్చింది!

"ఇరుక్కుపోయానే! ఎంత గొప్ప రాజావారు! ఎంత గొప్ప కోట!" అనుకున్నారు డాక్టరుగారు.

అంతలో పరిచారకులు ప్రక్కనే ఉన్న ఓ గది తలుపులు తెరిచి డాక్టరు గారిని సున్నితంగా లోనికి నెట్టారు: లోపల చక్కని, వెలుతురు పరచుకొని ఉన్నది. గది వాతావరణం వెచ్చగా, ఆహ్లాదకరంగా ఉన్నది. క్రింద పర్షియా దేశపు తివాచీ పరచుకొని ఉన్నది. విశాలమైన గదికి అనేక కిటికీలూ, ఎత్తైన తలుపులూ, ఎక్కడ చూసినా కర్టెన్లు- గదికి ఒక ప్రక్కగా పెద్ద పాన్పు, దానిమీద అటు తిరిగి కూర్చొని ఉన్న చక్కని ఓ యువతి-

"నమస్కారమమ్మా! నాకోసం మనుషుల్ని పంపారు, నేను చేయగల్గిన సేవ?!" అన్నారు డాక్టరు గారు, అక్కడే నిలబడి.

"ఓ డాక్టరు గారు! వచ్చారా?! మీకోసమే ఎదురు చూస్తున్నాను. రాగలరో, లేరో అని ఆందోళన పడుతున్నాను" అన్నదామె ఇటు తిరిగి.

మెరుపు తీగలాంటి సౌందర్యం ఆమెది. ఆమెని చూడగానే తనని ఎందుకు పిలిచారో అర్థమైంది డాక్టరు గారికి. ఆమె గర్భవతి- నెలలు నిండాయి. ప్రసవ సమయం.

డాక్టరు గారు రాజావారి కేసి చూస్తూ తనకు ఏమేం వస్తువులు కావలసి ఉంటాయో తెలియజేశారు. ఆయన తల ఊపి మరుక్షణం ఒక సంచీని డాక్టరు గారికి అందించాడు. అందులో డాక్టరుగారు అడిగిన వస్తువులన్నీ ఉన్నాయి!

డాక్టరు గారికి చాలా ఆశ్చర్యమూ, భయమూ ఒకేసారి కలిగాయి. అయినా ఆయన బయట పడక, తన పని మొదలు పెట్టాడు. రాణీ గారిని మంచం మీద పడుకొమ్మన్నాడు, ఆమె తలకు నడుముకు

ఏవో మందు పట్టీలు వేశాడు. ఒక ఇంజక్షన్ ఇచ్చాడు, రక్తపోటును పరీక్షించాడు- ఆశ్చర్యంగా, ఎన్ని రకాలుగా చూసినా, ఆమె రక్తపోటు ఎంతున్నదీ తెలీనే లేదు ఆయనకు! అయినా పరవాలేదన్నట్లు పనిలోకి దిగారు డాక్టరుగారు.

కొద్ది సేపు అక్కడే నిలబడి చూసిన రాజావారు డాక్టరు గారు పని మొదలు పెట్టగానే మర్యాదగా బయటికి నడిచారు. ఆయనతో బాటు ఆయన అనుచరులంతా బయటికి వెళ్లారు.

కొద్దిసేపటికి రాణీ గారికి ప్రసవమైంది. మగ బిడ్డ పుట్టాడు. పిల్లవాడి గుండె శబ్దమూ, ఊపిరీ అన్నీ సరిగానే ఉన్నాయని పరీక్షించి, వాడిని తల్లి ప్రక్కనే పడుకోబెట్టి, దుప్పట్లు అవీ చుట్టారు డాక్టరు గారే, స్వయంగా.

ఆ సరికి తేరుకున్న రాణీగారు నీరసంగా నవ్వి-"ధన్యవాదాలు, డాక్టరు గారు! నాకోసం మీరు చాలా శ్రమపడ్డారు. అయితే మిగిలిన వాళ్లంతా వచ్చేలోగా మీకు కొన్ని సంగతులు చెప్పాలి-"అన్నది.

"చెప్పండి" అన్నాడు డాక్టరు గారు.

చూడండి-ఈ పాటికి మీకు అర్థమై ఉండాలి. మేం మనుషులం కాదు. మేమందరం యక్షులం. ఈనాటి వరకూ మా దగ్గరికి వచ్చినవాళ్ళెవరూ తిరిగి వెనక్కి వెళ్ళలేదు. అందుకని చెబుతున్నాను- మా వాళ్లు మీ మీద మంత్రం ప్రయోగించాలని చూస్తారు- కానీ నేను చెప్పే ఈ సంగతులు విని, జాగ్రత్తగా మసలుకుంటే మటుకు మీరు క్షేమంగా బయటపడగల్గుతారు-"ఇక్కడ మీరు ఒక్క చుక్క మంచి నీళ్లు కూడా తాగద్దు; ఒక్క మెతుకు అన్నం కూడా తినద్దు- గుర్తుపెట్టుకోండి.

-దానితో బాటు ఇంకో సంగతి-ఇక్కడ ఏం జరిగినా మీరు ఆశ్చర్యపోయినట్లు కనిపించకూడదు; దేనికీ అడ్డు చెప్పద్దు. అయితే వాళ్లు మీకు డబ్బులు ఇవ్వ జూసినప్పుడు- కేవలం ఐదు బంగారు నాణాలు మటుకు తీసుకోండి- వాళ్లు మీకు ఏ ఐదు వందలో, ఐదువేలో ఇవ్వ జూపినా తిరస్కరించండి" అన్నది.

"ధన్యవాదాలు తల్లీ! నా ప్రాణాలు కాపాడారు. తప్పకుండా మీరు చెప్పినట్లే

చేస్తాను " అన్నారు డాక్టరు గారు ఊపిరి పీల్చుకుంటూ.

అంతలోనే ఆయన్ని తీసుకువచ్చిన యక్షుల రాజు లోనికి వచ్చాడు. ఇప్పుడతను రాజోచితమైన దుస్తులు ధరించి మెరసిపోతూ ఉన్నాడు. "ఏడీ పిల్లాడు?! ఏడీ నాకొడుకు?!" అని సంతోషంగా పోయి పిల్లవాడిని చేతుల్లోకి తీసుకున్నాడతను. "ఉం.. బాగున్నాడు! నాకు తగినట్లే ఉన్నాడు!! డాక్టరు గారూ, చాలా ధన్యవాదాలు! మీ రుణం ఉంచుకోం!" అని అతనోసారి చుట్టూ కలయజూశాడు.

గదిని వెచ్చగా ఉంచేందుకు ఒక మూలగా పొయ్యి ఒకటి రగుల్తూ ఉన్నది. రాజావారు ఇప్పుడు ఆ పొయ్యి దగ్గరికి వెళ్లి, ప్రక్కనే ఉన్న సాధనంతో దానిలోని నిప్పుల్ని ముందుకు జరిపారు. బూడిద అంతా కదిలేసరికి పొయ్యిలో మండుతున్న బొగ్గులన్నీ ఎర్రటి మాంసం ముద్దల్లాగా మెరవసాగాయి. రాజుగారు చకచకా ఆ బొగ్గులన్నిటినీ ముందుకు లాగి కుప్పచేసారు. డాక్టరుగారు చూస్తుండగానే ఆయన మళ్లీ మంచం దగ్గరికి వచ్చాడు. పిల్లవాడిని ఎత్తుకొని, ప్రేమగా ముద్దాడుతూ తీసుకెళ్లి, చటుక్కున పొయ్యిలో ఏర్పడ్డ ఖాళీలో పడుకోబెట్టారు!

నిశ్చేష్టులైన డాక్టరు గారు తేరుకునే లోపు నిప్పులన్నీ వెనక్కి జరిపి పిల్లవాడి మీదంతా నిప్పులు కప్పేశారు!

డాక్టరు గారు ఆందోళనగా రాణిగారి వైపు చూశారు, కానీ ఆవిడ 'అదంతా మామూలే' అన్నట్లు చిరునవ్వు ముఖంతో చూస్తున్నది! "దేనికీ అడ్డుచెప్పవద్దు" అని గుర్తు చేసుకున్న డాక్టరుగారు ఏడుపును దిగమ్రింగి, ముఖాన్ని ప్రశాంతంగా పెట్టుకునే ప్రయత్నం చేశాడు.

అంతలో వాళ్లున్న ఆ గది ఇంకా అందమైన మరో పెద్ద గదిలా మారిపోయింది! పైన ఊగిసలాడే షాండ్లియర్లు, దీపాలు పెట్టుకునే నిలువెత్తు ప్రమిదెలు, మెరిసే తోరణాలు, రకరకాల చెక్క వస్తువులు!!

ఆ గది మధ్యలో డాక్టరు గారు అంత వరకూ ఏనాడూ చూడనంత పెద్ద టేబులు పరచి ఉన్నది! దాని మీద వందలాది వంటకాలతో

చవులూరించే చక్కని భోజనం! రకరకాల మాంసాలూ, పానీయాలు, పండ్లు, పండ్ల రసాలు, సారాయాలు!!



'రండి డాక్టరుగారూ! మీసాయానికి కృతజ్ఞతలతో మేమిచ్చే యీ చిన్నపాటి విందును స్వీకరించండి. మీకు నచ్చినవేంటో తెలీదు కనక, ఇలా రకరకాలు చేయించాం. రండి" అన్నారు రాజావారు, ఆయన్ని ఆహ్వానిస్తూ.

"అయ్యా! మీరేమీ అనుకోకండి-నేను ఇవాళ్ల, రేపు రెండ్రోజులు ఉపవాసం- మళ్లీ ఇల్లు చేరేంతవరకూ ఏదీ తినేందుకు, తాగేందుకు లేదు- అందుకని నన్ను క్షమించండి; వీలైనంత త్వరగా నన్ను మా ఇల్లు చేర్చే ఏర్పాటు చేయిస్తే చాలు- ఇంకేమీ వద్దు" అన్నారు డాక్టరు గారు తల అడ్డంగా ఊపుతూ.

"ఓ తప్పకుండా! అయితే ముందు మీ సాయానికి ఈ చిన్నపాటి బహుమానం-" అంటూ బంగారు నాణాల మూటనొకదాన్ని ఆయన ముందుకు జరిపారు రాజుగారు, దాన్ని విప్పి నాణాలను చూపిస్తూ.

డాక్టరు గారు నవ్వి-"ధన్యవాదాలు రాజువారూ! అయితే వీటిలోంచి నాకు చెందాల్సిన డబ్బే నేను తీసుకుంటాను" అంటూ ఐదు నాణాలను ఎంచి పర్సులో పెట్టుకొని మిగతా మూటను అక్కడే టేబుల్ మీద ఒదిలారు- "మరి ఇక సెలవా, నన్ను వెనక్కి తీసుకెళ్లేందుకు బండి ఏర్పాటు.. ఆలస్యం అవుతున్నది.. బయలుదేరతానిక! వెళ్లొస్తానమ్మా..! జాగ్రత్త..!" అంటూ.

ఈ మాటలు విని రాజావారు గట్టిగా నవ్వారు- "ఓహో! అర్థమైంది! మా రాణీ గారు మీకు రహస్యంగా జ్ఞానబోధ చేసేసారన్న మాట!-అయినా పర్లేదులే, మీరు గొప్ప హృదయంతో, మాకు నిజంగానే సాయం చేశారు. అందుకని మీరు క్షేమంగా ఇల్లు చేరుకుంటారు- పర్లేదు" అంటూ గట్టిగా చప్పట్లు కొట్టారు.

వెంటనే మళ్లీ గుర్రపు బండి వచ్చింది; నీళ్ల గుండాను, గాలిలో తేలుతూనూ పోయింది. తెల్లవారు జాముకల్లా డాక్టరు గారు ఇల్లు చేరుకొని ఊపిరి పీల్చుకున్నారు. జరిగిందంతా ఓ పీడ కల అన్నట్లు, దాన్ని ఇక గుర్తు చేసుకోకుండా వేరే పనుల్లో మునిగిపోయారు.

తర్వాత, కొన్ని రోజులకి, ఆయన బిడ్డ పెళ్లి బాగా దగ్గర పడ్డాక, "వాళ్లిచ్చిన్న బంగారు నాణాలు అమ్ముకుంటే తప్ప వీలవదు" అని తన పర్సును తెరచి చూసిన డాక్టరు గారు నిర్ఘాంతపోయారు- దానిలో తను ఎంచుకున్న బంగారు నాణాలతో బాటు నిండా విలువైన వజ్రాలు అనేకం ఉన్నై!!

వాటితో బాటు ఒక చిన్న కాయితం.. మడత పెట్టి ఉన్నది. డాక్టరుగారు ఆ కాగితం తీసి చదివారు- *"మీ అమ్మాయి పెళ్ళి శుభాకాంక్షలు! మీ ఖర్చులకోసం ఈ బంగారు నాణాలు; మీరు చేద్దామనుకుంటున్న మంచి పనులకోసం ఈ వజ్రాలు. మీ మంచి పనుల పుణ్యంతో మాకు యీ జన్మ నుండి విముక్తి తప్పక కలుగుతుంది- సందేహం లేదు!"*

బంగారు నాణాలతో డాక్టరు గారి బిడ్డ పెళ్లి ఘనంగా జరిగింది. అటుపైన, మిగిలిన వజ్రాల డబ్బులతో డాక్టరుగారు ఆసుపత్రిని పెద్దగా చేసారు; లెక్కలేనంతమంది రోగులకు ఉచితంగా వైద్య సేవలు అందించారు. ఆయన మంచి పనుల వల్ల యక్షులందరికీ పుణ్యలోకాలు లభించాయి. అందుకనే, ఇప్పుడు మనకెవ్వరికీ యక్షులు అసలు కనిపించటమే లేదు!

అమెరికా వాడు: మా దేశంలో కరెంటు పోతే వెంటనే కరెంటు ఆఫీసుకి ఫోన్ చేస్తాం!

జపాన్ వాడు: మా దేశంలో కరెంటు పోతే వెంటనే ఫ్యూజులు చెక్ చేసుకుంటాం!

మనవాడు: మా దేశంలో కరెంటు పోతే ప్రక్క వాళ్లింట్లోకి తొంగి చూస్తాం!



# మత్కుణం కథ

*తెనాలి రామకృష్ణుడి తెలివి !*
*సౌజన్యం: శ్రీమతి సుగుణ రూపనగుడి, ముఖపుస్తకం.*

ఒకసారి కృష్ణదేవరాయలవారి ఆస్థానానికి ఒక సంస్కృత పండితుడు వచ్చాడు. ఆయనతో పాటు ఒక బండి నిండా పత్రాలు ఉన్నై. "సంస్కృతంలో నన్ను మించినవాడు లేడు. అనేక దేశాల సంస్కృత పండితులు నాతో ఓడి, నాకు ఈ విజయపత్రాలను అందించారు. మీ రాజ్యపు పండితులతో శాస్త్ర చర్చ చేద్దామని వచ్చాను. మీ రాజ్యంలో ఎవరైనా పండితుడన్నవాడు ఉంటే నాతో తలపడమనండి. లేదూ, వారెవ్వరూ నాతో శాస్త్ర చర్చకు ముందుకు రాలేమంటే, మరి విజయపత్రాలను ఇప్పించండి" అన్నాడు గొప్పగా.

రాయలవారు సభలోని కవుల కేసి చూసారు. వాళ్లంతా కొంచెం ఇరుకున పడ్డారు. ఏమంటే "ఆస్థానంలో ఉన్న సంస్కృత పండితులు అందరూ ఆ సమయానికి వేరే దేశానికి వెళ్ళి ఉన్నారు- రాజ్యంలో ఉన్నదల్లా తెలుగు కవులు మాత్రమే. ఈ సంస్కృత కవి తీరు చూస్తే మామూలు వాడిలాగా లేడు.

ఊరికే చర్చించేదెందుకు, ఓడేదెందుకు, రాజ్యాన్నంతా ఓటమి పాలు చేసిన అపకీర్తిని మూటగట్టుకునేదెందుకు?"

రాయలవారు వారి సంశయాన్ని గుర్తించారు. సభలో కూర్చున్న తెనాలి రామకృష్ణుడికేసి చూసారు. రామకృష్ణుడు ఇకిలించాడు. రాయలవారు తల పంకించారు. "అయ్యా! పండితులవారూ! మా సంస్కృత కవులందరూ విదేశ యాత్రలో ఉన్నారు. వారి శిష్యులైన పామరులు మాత్రం కొందరు ఇప్పుడు అందుబాటులో ఉంటారు. తమరి రాకను వారికి తెలియజేస్తాం. రేపు మధ్యాహ్నంగా శాస్త్రచర్చ ఏర్పాటు చేసుకుందాం. అంతవరకూ తమరు మా ఆతిథ్యం స్వీకరించండి" అని పండితులవారికి తుంగభద్రా నదీ తీరాన వున్న ఒక భవంతిలో విడిది ఏర్పాటు చేసారు.

పండితులవారు అటు పోగానే ఇటు రాయలవారు "రామకృష్ణా!" అన్నారు.

"ప్రభువులవారు ఈ పని నాకు వదిలెయ్యండి!" అన్నాడు రామకృష్ణుడు నవ్వుతూ.



మరునాడు తెల్లవారే సరికి రామకృష్ణుడు చాకలివాడి వేషం వేసుకున్నాడు. తన భార్యకు చాకలమ్మ వేషం వేసాడు. ఏం చెయ్యాలో అంతా ఆమెకు చెప్పి వుంచాడు. ఓ బట్టల మూటనెత్తుకొని తను తుంగభద్రా నదీ తీరం చేరుకున్నాడు. నదిలో బట్టలు ఉతుకుతున్నట్లు నటించటం మొదలు పెట్టాడు.

అనుకున్నట్లే ఆ రేవు దగ్గరికి వచ్చాడు సంస్కృత పండితుడు. నదిలోకి దిగి స్నానం చేస్తున్నాడు. చాకలి ఆయన తీరును చూస్తూ తన జోరు పెంచాడు.

అంతలోకే చాకలమ్మ వచ్చింది మరో చిన్న

బట్టల మూట పట్టుకొని. రామకృష్ణుడిని అడిగింది గట్టిగా, దగ్గర్లోనే ఉన్న పండితుడికి వినబడేట్లు- "యివ్వాళ అన్నం లోకి సాధకం ఏమి చెయ్య మంటావు మామా ?" అని.

చాకలివాడు కొంచెం ఆలోచించాడు:

"మత్కుణం నది సంయుక్తం,

విచార ఫల మేవచ,

గోపత్నీ సమాయుక్తం,

గ్రామచూర్ణం చ వ్యంజనం" అని జవాబిచ్చాడు.

ఆమె కనబడీ కనబడనట్లు నవ్వింది. "సరే అలాగే- 'తథైవ అస్తు' " అని చెప్పి, ఉతికిన బట్టలు పట్టుకొని వెళ్ళిపోయింది.

నదిలో సంధ్యావందనం చేసుకుంటున్న పండితుడికి తల తిరిగినట్లైంది. "ఈ దేశంలో ఒక సాధారణ చాకలి, చాకలమ్మ సంస్కృతంలో మాట్లాడుకున్నారు! ఇంతగొప్ప సంస్కృత పండితుడైన తనకు ఆ శ్లోకం అర్థం కాలేదు!"

"ఇంతకీ 'మత్కుణం' అంటే ఏంటి? 'మత్కుణం' అంటే సంస్కృతంలో 'నల్లి' అని అర్థం. 'నది సంయుక్తం' అంటే 'నదితో కలిసినది'- నల్లి నదితో కలవటమేమిటి? తెలీదు!

"విచార ఫలం" అన్నాడు- విచారిస్తే ఫలితం ఏముంటుంది? కన్నీళ్ళు వస్తాయి.. అయితేనేమి?

ఇక "గో పత్ని- ఆవు భార్య" అంటున్నాడు. ఆవే ఆడది కదా, ఇక ఆవుకు భార్య ఎక్కడినుండి వస్తుంది?

అంతా చేసి "గ్రామ చూర్ణం" కావాలంటున్నాడు! అదేంటి?

"పోనీ 'దీనికంతా అర్థం లేదు' అనుకుందామంటే అట్లానూ లేదే, చాకలమ్మ "సరే సరే" అని పోయింది. అంటే ఆమెకు అర్థమైనట్లే కదా!" ఆలోచించీ ఆలోచించీ అతనికి మతి పోయింది-

"ఈ రాజ్యపు చాకలివాడి శ్లోకమే తనకు అర్థం కాలేదు- చాకలమ్మకు అర్థమయినంత నాకు అర్థం కాలేదు. యింక రాజుగారి దగ్గర పనిచేసే పండితులతో నేనెక్కడ గెలువగలను?" అనుకున్నాడాయన. రామకృష్ణుడు చూస్తుండగానే ఒక నిశ్చయానికి వచ్చినట్లుగా బయలుదేరి

భవనానికి వెళ్లి, మూటా ముల్లె సర్దుకొని, నగరం విడిచి పారిపోయాడు.

మరునాడు సభలో రాయలవారు అడిగారు- "ఏడీ! పండితుడు?!" అని.



"విడిది పరిసరాల్లో ఎక్కడా లేడు" చెప్పారు భటులు. "వేరే నగరానికి వెళ్తున్నానని చెప్పి ఉదయాన్నే వెళ్ళాడాయన!"

వింటున్న రామకృష్ణుడు నవ్వాడు. రాయలవారు "నువ్వే ఏదో చేసినట్లున్నావు?!" అన్నారు మర్మగర్భంగా

"లేదు- నేను కాదు, ఇదంతా చేసింది మత్కుణం" అని కథంతా చెప్పాడు రామకృష్ణుడు.

రాయలవారు నవ్వి, ఇంతకీ ఈ శ్లోకం మాక్కూడా అర్థం కాలేదు- ఏంటి, దీని కథ?" అన్నారు.

అప్పుడు రామకృష్ణుడు ఇలా అర్థం చెప్పాడు:

"మత్కుణం అంటే నల్లి; నది అంటే ఏరు. నల్లి, ఏరు కలిసి 'నల్లేరు' అయ్యింది.

విచారం అంటే చింత; ఫలం అంటే పండు- కలిసి చింతపండు అయ్యింది.

గోవు అంటే ఆవు; పత్ని అంటే భార్య- ఆలు. ఆవు,ఆలు కలిస్తే అయ్యేవి ఆవాలు-"

రాయలవారు కడుపుబ్బా నవ్వారు. మరి ఇంతకీ గ్రామచూర్ణం ఎలా చేస్తారు? అన్నారు.

ఏమీ లేదు- గ్రామం అంటే ఊరు; చూర్ణం అంటే పిండి- వెరసి 'ఊరుబిండి' అవుతుంది ప్రభూ. మన సీమలో అందరికీ ఇష్టమైన పచ్చడి కదా అది?" అన్నాడు రామకృష్ణుడు కొంటెగా.

"నల్లేరు, ఆవాలు, చింతపండు కలిపి చేసే వూరుపిండి సంస్కృత పండితుడినే భయపెట్టిందే, అంతగొప్ప పండితుడు పలాయనం చిత్తగించేట్లు చేసింది ఇది మామూలుది కాదు" నవ్వారు రాయలవారు

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**జంతువులు, పదరంగం, జీవనం, దొంగలు, విరుద్ధం, జీవితం, బురద, కఠినం, మనసు, బాధ్యత, ప్రయత్నం, ఆసుపత్రి, కృతజ్ఞత, వందనాలు, వంకాయ, స్నేహితులు, త్రాగుబోతు, రాయి, వస్తువులు, శబ్దం.**పై పదాలు ఈ క్రింది పట్టికలో దాగున్నాయి- నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రిందినుండి పైకి- ఎటుపడితే అటు! వాటిని వెతికి పట్టుకోండి. వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!

| తీ | మ | వ | స్తు | వు | లు | ణ | ను | ర | ను | భా | శ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| క | కృ | ఖ | స్నే | న | క్తం | వ | గ | బ్దం | ఘ | బ్దం | గ్య |
| జ్ఞ | ప | త | స్నే | హి | త | ల | తు | బో | గు | త్రా | ఫ |
| ప | బ | మ | జ్ఞ | భ | తు | వ | ల | తం | వి | ప్ర | శ |
| ద | మ | చ | ఛ | త | మ్మృ | లు | హి | జ | ప్ర | ఘ | రా |
| రం | న | ణ | ధ్య | య | వు | జం | తం | ర | న | ల | యి |
| గం | సు | బా | వ | తు | వి | రు | వి | వి | త్నం | వి | శ |
| ల | సు | శ | జం | లు | హ | వు | రు | జ్ఞా | జీ | న | సు |
| వ | వు | లు | క్ష | స్తు | నా | లు | ద్ధం | సు | వ | ర | ఆ |
| ద | ర | బ | లు | గ | దొం | ద | ఆ | కా | నం | బృ | సు |
| ర | ల్నీ | జీ | వి | త | య | కా | వం | ఠి | వం | క్రం | ప |
| బు | వి | రు | త్నం | య | ప్ర | మ్ర | క | వ | యి | ప | త్రి |

# పదరంగం-83

*కూర్పు: నారాయణ, కొత్తపల్లి.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | 4 | ★ |
| 5 | | | ★ | 6 | 7 |
| 8 | | ★ | ★ | 9 | |
| 10 | | ★ | 11 | | |
| 12 | | 13 | | | |
| | ★ | 14 | | | |

## నిలువు:

1. వెంకటేశ్వర స్వామి ధరించే నామాల్ని ఇలా పిలుస్తారు (6)

2. 'అరమరిక'లే గందర గోళమైతే ఎలాగ? (5)

3. అంతంపోయిన 'గణము' (2)

4. గజిబిజి అయినా సరే, ఐదోతరగతికి ఇన్నేళ్ల వయసుండాలి (6)

7. చిట్టి పాపల్ని పెద్దవాళ్ళు ముద్దుగా ఇలా పిలుస్తారు (5)

11. నాన్న చెల్లెలు! (3)

13. ఆద్యం తాలులేని 'కొరకొరా' (2)

## అడ్డం

1. సరిమళ్ల కాదు-తిరగేసుకున్నావు! (5)

5. 'కరుణ'లో గందరగోళం! (3)

6. 'శుభం' అని రాస్తే ఒకాయన ఇలా చదివాడట! (2)

8. విల్లుకు కట్టేతాడు. 'స్త్రీ' అని కూడా అర్థం (2)

9. 'గాలి దేవుడు' 3,1 (2)

10. మమకారంలో మొదటి రెండు (2)

11. నగరానికి పెద్ద (3)

12. గజిబిజైన 'అనవరతము' (6)

14. మీరు చదువుతున్న పుస్తకం! (4)

* మీ సమాధానాల్ని కేవలం పోస్టుకార్డులో మాత్రమే రాసి పంపండి.

* మీ పేరు, తరగతి, బడి, చిరునామా, ఫోను నెంబరు తప్పక రాయండి.

* సరైన సమాధానం రాసి పంపిన పిల్లల్లోంచి ఇద్దరిని లాటరీ ద్వారా ఎంపిక చేసి, కొత్తపల్లి పుస్తకంతో పాటు చెరొక 50రూాలు బహుమతిగా పంపుతాం!

మా చిరునామా: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**




రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:

వ్యక్తులకు: **300/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

సంస్థలకు: **350/-**

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం అక్కౌంటు వివరాలు:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBHY0020902

Transfer వివరాలను మాకు మెయిల్ ద్వారా తెలియజేయండి: team@ kottapalli.in

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్సుఫర్ చేయగలరని ప్రార్థన)

ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 set | 9 | 22 | 180 |
| 2 | 2012 Set | 11 | 27 | 220 |
| 3 | 2013 Set | 7 | 22 | 175 |
| 4 | 2014 Set | 10 | 500 | 250 |
| 5 | 2015 Set | 7 | 1150 | 175 |


మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 07/04/2016 Postal Regn No: HDP/008/2015-2017

## అసంతృప్తి

అబ్బ ఏం ఎండలు! ఏం ఎండలు!! కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ వచ్చారు ప్రమీల, సుబ్బారావు.

మా ఇంటి ముందున్న మందార చెట్లూ, వేప చెట్లూ, జామ, సపోటా చెట్లూ, పూల మొక్కలూ అన్నీ సన్నగా నవ్వాయి-వాళ్ల ముఖాల మీదికి చల్లటి గాలిని విసిరాయి ప్రేమగా.

"మీ ఇల్లు బాగుంది చల్లగా" అన్నాడు సుబ్బారావు, లోపలికి రాగేనే. "చుట్టూ చెట్లున్నాయి కదా" నేను మురిసిపోయాను.

"ఎసి ఉంటే బాగుండేది-ఏసి తెచ్చుకోలేదా?" అంది ప్రమీల నా ముఖం మాడకముందే.

మా ఆవిడ సునీత నీళ్లు తెచ్చిచ్చింది. సుబ్బారావు, ప్రమీల ఆర్తిగా తాగారు.

"ఇక్కడ నీళ్లు బానే ఉన్నాయే," అన్నాడు సుబ్బారావు. నేను సంతోషంగా నోరు తెరిచా, ఏదో చెప్పాలని-

"చల్లగా లేవు ఫ్రిజ్ లేదా?" అంది ప్రమీల. నేను టక్కున మా ఆవిడ నోరు మూసాను.

"వస్తున్నారుగా, సెలవుల్లో మా ఊరికి?" అన్నాడు సుబ్బారావు.

"వస్తూన్నాంరా, అతి కష్టం మీద రిజర్వు చేయగల్గాం."

"ఏరైల్లోనూ లేవు, ఏ తరగతిలోనూ లేవు. ఇదొక్కటే, స్లీపర్ క్లాస్‌లో, మా కోసమే ఉన్నట్లు, ఉంది" చెప్పా సంతోషంగా.

"అయ్యో! ఎసిలో చేసి ఉంటే బాగుండేది. ఎండలు కదా!" అంది ప్రమీల.

"ఇంతకీ మీవాడి చదువులెలా ఉన్నాయి? ఆ సెయింట్ x బాగుంటుంది, ఆ బడేగా?" అన్నా మాట మారుస్తూ.

"yy సీటు కోసం ట్రై చేశాం గానీ రాలేదురా, ఇక్కడే ఉండాలి యీ ఏడాది కూడా" విచారంగా చెప్పాడు భార్యకేసి చూస్తూ.

"మీ తిరుపతి ప్రయాణం బాగా సాగిందా, ఇప్పుడు అన్నీ ఆన్లైన్లో చేసుకొని వెళ్లచ్చుట" అడిగా, మాట మార్చినట్లుంటుందని.

"అయ్యో ఏం చెప్పాలి. ఒక వైపున ఎండ, కార్లో ఎంత ఏసి పెట్టినా దిగేసరికి చెమటలు, దారంతా గతుకులు, ఆ రూములు కొత్తవట, అయినా ఎలా తగలడ్డాయో, ఇంక దర్శనమా-నేను చెప్తూనే ఉన్నా యీయనకి- 'స్పెషల్ టిక్కెట్టు తీసుకోండి' అని. ఈయన గొప్పగా పోయి ఇంకేదో వాచీ తీస్కున్నారు" చెప్పేసింది ప్రమీల. సుబ్బారావు దీనంగా మొహం పెట్టాడు.

నేను వాళ్ల కొడుకు- ఏడో తరగతి పిల్లాడు- వాడికేసి చూసి ఎంకరేజ్ చేస్తున్నట్లు నవ్వా. వాడు నవ్వలేదు. సీరియస్‌గా తన బ్యాగులోంచి ఓ దుబ్బ "ఐఐటీ కెమిస్ట్రీ" పుస్తకం బయటికి తీసి, అందులోని మూలకాల లిస్టును బట్టీ పట్టటం మొదలు పెట్టాడు. నేను గట్టిగా నవ్వా. అందరూ నాకేసి వింతగా చూసారు.

“ఈ పుస్తకాల ఎంత లావు ఉన్నాయో చూసావా? వీటిని మోసీ మోసీ వీళ్ళ నడుములు వంగిపోతున్నాయి పాపం. వీటిని సన్నగా చేస్తేనేం, మీలాంటివాళ్ళు, ఊరికే కూర్చొని నవ్వకుండా?” అన్నది ప్రమీల.

"కొన్ని జీవితాల్లోకి సంతృప్తి రమ్మన్నా రాదే, ఎందుకని? వాళ్ల పిల్లలకు ఎంత కష్టం?!" ఆలోచనలో పడిపోయాను నేను.

"ఇదిగో, మళ్లీ ట్యాంకులో నీళ్లు అయిపోతే కష్టం, పోయి మోటారు వెయ్యి. తర్వాత తీరిగ్గా విచారిద్దువు" నన్ను కుదిపింది మా ఆవిడ నవ్వుతూ.

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at “Kottapalli”, 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.